15

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము

అను

## కారాది ప్రతిపదార్థపర్యాయపధ నిఘంటువు

రెండవ ముద్రణము - మొదటి సంచిక.

1. ఫారట మొదలు 96 ఫారట వఱకు.



ఇది

ఆంధ్రవిద్యావాచస్పతి

కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే

వ్రాయఁబడి ప్రకటింపఁబడినది.

కరప, కాకినాడ తాలూకా.

రైతు ముద్రాక్షరశాల రాజమహేంద్రవరము.

ఆగష్టు 1948.

సంచిక వెల. రు 2-0-0 (నలుబది సంచికలగును.)

...వు:— అగస్టు నెలాఖరులోపున పూరా వెల రు 35-0-0; సెప్టెంబరు
...లోపున పూరా వెల రు 40-0-0; అక్టోబరు నెలాఖరు లోపున
...-0; పిదప పూరా వెల రు 50-0-0 యేబది రూపాయలు.
...సము:- ఆంధ్రవాచస్పత్య కార్యాలయము, ప్రస్తుతము రాజమండ్రి.

# శ్రీ ఆంధ్రవాచస్పత్య కార్యాలయము వారి ప్రకటనలు.

ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యనిధి, సాహిత్యసరస్వతి, జ్ఞానగుణాకర, ఆంధ్ర వాఙ్మయమహోదధి, కొట్ర శ్యామలాకామశాస్త్రి. కర. కాకినాడ, ఆంధ్రవాచస్పత్య కార్యాలయము, ప్రస్తుతము. [illegible]పవారి వీధి. రాజమండ్రి. తూర్పు గోదావరిజిల్లా,

## 1. ఆంధ్రవాచస్పత్యము రు 50-0-0 లు.

అయ్యా, నేను 25 సం॥లు విశేషపరిశ్రమచేసి వ్రాసి ప్రకటించిన మొదటి ముద్రణము 3000 పుటలుగల "ఆంధ్రవాచస్పత్యము" (అను) ప్రతిపదార్థ పర్యాయపదనిఘంటువు 2000 ప్రతులన్ను ఆంధ్రమండలమెల్ల నచిరకాలములోనే వెదఁజల్లఁబడినవి.

దీని పునర్ముద్రణము:-ఇదిమొత్తె మొకలక్ష శబ్దంబులతో విశేషాంశములతో రమారమి 4000 పుటలుగా పునర్ముద్రణము చేయఁబడుచున్న బృహన్నిఘంటువు. సంచిక వెల రు 2-0-0 (నలుబది సంచికలగును) తగ్గింపు రేటునకు గడువులు:- ఆగష్టు నెలాఖరు లోపున పూరా వెల రు 35—0—0 లు; సెప్టెంబరు నెలాఖరు లోపున రు 40—0—0 లు; అక్టోబరు నెలాఖరు లోపున రు 45—0—0 లు; పిదప పూరా వెల రు 50—0—0 లు; త్వరపడుడు. కోరు వారికి వెంటనే పంపబడును.

## 2. హిందూస్తానీ తెలుఁగు వాచస్పత్యము రు 15-0-0 లు.

హిందూస్తానీ తెలుఁగు వాచస్పత్యము (అను) ప్రతిపదార్థ పర్యాయపదనిఘంటువు 1200 పుటలుగలగ్రంథముఅచ్చొత్తింపఁబడుచున్నది. అది కూడ ఈ సెప్టెంబరు 15 తేదిలగాయితు నెల 1కి 100 పుటలకు రు.2-0-0 లు చొ॥న ఇచ్చినవారికి 12 నెలల వరకు పంపఁబడుచుండును. తగ్గింపు రేటునకు గడువులు:- ఆగష్టు నెలలోపున పూరా వెల రు 8-0-0 లు; సెప్టెంబరు నెలలోపున పూరా వెల రు 10-0-0 లు; అక్టోబరు నెలలోపున పూరా వెల రు 12-0-0; పిదప పూరా వెల రు 15-0-0 లు త్వరపడుడు.

## 3. ఆంధ్రవ్యాకరణ వాచస్పత్యము రు 10-0-0 లు.

ఆంధ్రవ్యాకరణ వాచస్పత్యము (అను) అకారాద్యుదాహరణ శబ్దమాత్రసంఖ్యానిర్ణయ నిఘంటువు. 800 పుటలు గల గ్రంథము అచ్చొత్తింపఁబడుచున్నది. అదికూడ ఈ సెప్టెంబరు 15 తేదీ [illegible] నెల 1కి 100 పుటలకును 2—0—0 లు

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము

అను

## అకారాదిప్రతిపదార్థపర్యాయపద నిఘంటువు

## శ్రీశ్యామలాకామశాస్త్రీయము

మొదటి సంపుటము

అ మొదలు ఔ వఱకు.





ఇది

ఆంధ్రవిద్యావాచస్పతి

కొట్ర శ్యామలాకామశాస్త్రిచే

వ్రాయఁబడి ప్రకటింపఁ బడినది.

కరప, కాకినాడ తాలూకా.

---

రైతు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.

1948.

మొదటి సంపుటము రు. 10-0-0 లు } మొత్తము అయిదు సంపుటములు వెల రు. 50-0-0 లు.

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ వాజపేయాజుల రామ సుబ్బారాయఁడుగారు
కోహ్లాపురం, ముచవకొండ, కర్నూలు జిల్లా.

ఉ. శ్యామలకామశాస్త్రి! ఘనమైన నిఘంటువు నీదటంచు బల్
కోమలమైన శబ్దములఁగూర్చితనేకము, తల్లిదండ్రులే
నోమును నోచి మిమ్ములఁదనూభవుగాఁ గొనినారొ, మీకృతుల్
సోమ దినేశ తారకలు శోభిలు దాక వెలుంగు లీనుతన్.

---

బ్రహ్మశ్రీ భక్తకవులు బాచిమంచి శ్రీ హరిశాస్త్రిగారు,
ఈకృష్ణమూర్తిగారు, శ్రీ సీతారామగ్రంథనిలయము.
బాచిమంచివారి అగ్రహారము, వీరంకిలాకు, వుయ్యూరు, కృష్ణాజిల్లా.

సీ. గర్వింతుమయ్య! నీకష్టాన ఫలియించి,
నట్టి "వాచస్పత్యమం"దు కలన,
విఱ్ఱ వీఁగుదుమయ్య! విఖ్యాత చరితుని,
భాషాప్రియుని, నిన్నుఁబడయు కలన,
మురిసి పోదుము నిన్నుఁ బోలు విద్వన్మణి,
ఆంధ్రావనికి లభ్యమైన కతన,
ఉప్పొంగుదుము వాఙ్మయోద్ధారకుఁడ వీవు,
మిము బోట్ల కండగా మసలు కతన,
గీ. తెలుఁగు కవులము, నిన్ను నుతింతుమయ్య!
కోట్రు సద్వంశ సంభవ! కూర్మి తోడ
శ్యామలా కామ శాస్త్రి! నా పలుకు నట్టి
వందనమ్ముల నన్నిటి, నందు కొనుము.

---

బ్రహ్మశ్రీ చింతలపూడి సన్యాసిరావుగారు, కౌముదీపరిషత్తు.
విజయనగరము.

సాకల్యంబుగ నాల్గు భాషల విశేష ప్రౌఢవస్ఫూర్తి బా
షా కళ్యాణి క్రియాను-భావముప శశ్వత్సార్థ శాభిఖ్య ధీ
లోకంబు, న్నలరించి శ్యాంచి కడుపొల్పున్ త్వద్బ్రహ్మలోకేశ మీ
శ్లోకంబుం డెద్దు నంత కాలమును నిల్చున్ "ఆంధ్ర వాచస్పతీ"

---

బాలకవి శేఖర శ్రీ వాకాటి పెంచలరెడ్డిగారు ఇసుకపాళెం. నెల్లూరు జిల్లా.

అయ్యా, తమ యశేష శేముషీ వైభవము పండిత ప్రకాండులకుఁ జిరపరిచితమే. ప్రకృత నిఘంటువులలోఁ దలమానికమై త్వదీయ నిఘంటు రాజము విరాజిల్లుచున్న దనెడి నుడి యొంతయు సత్యదూరమ్ముగాదని నాహృదయ పూర్వకసంపూర్ణాభిప్రాయము. సాహిత్య సేవాధురంధరులు తమ కెంతయు ఋణపడి యున్నారని నొక్కి వక్కాణింతును.

---

## విద్వాన్ ఉభయ భాషాప్రవీణ శ్రీ కోగంటి దుర్గామల్లిఖార్జునరావు గారు, బోర్డుహైస్కూలు. పామఱ్ఱు. కృష్ణాజిల్లా.

వాచస్పత్యము పత్కని
వాచస్పతి తతికిఁ గల్పపాదప మౌరా!
వాచస్పత్యం బలరెడు
వాచంద్రార్కము రమేశు నత్యంత కృపన్. ౧

వాచస్పత్యమునకు సరి
వాచస్పత్యంబె యగును వసుమతి లోనన్
వాచస్పత్య మహత్త్వము
వాచంయమి వరులకైన వాకొనఁ దరమే. ౨

సద్యో జాతంబులైన
విద్యా సంశయము లెల్ల వీడఁగ జేయున్
విద్యాభి వృద్ధిగూర్చును
విద్యార్థులు దీనిని దమ వెంటనె యిడినన్. ౩

పండిత జన మాన్యుండవు
పండిత వంశజుఁడ వీవు పరికింపంగాన్
బండిత సంతానంబునఁ
బండ మయూఖుఁడవు కామశాస్త్రీ! బళిరా!. ౪

శాస్త్రజ్ఞ వరేణ్యులు మీ
శాస్త్ర జ్ఞానంబుఁ గాంచి సంతసపడి యీ
శాస్త్ర జ్ఞానంబెటులీ
శాస్త్రి కొదవె ననరె? కామశాస్త్రీ! బళిరా! ౫

---

## బ్రహ్మశ్రీ విద్వాన్ తంగిరాల అప్పన్నగారు
## B. A., B. O. L., P. C. T., C. E. T. D.
### తెలుఁగు లెక్చరరు. వీరశైవకాలేజి. మెంబరు అన్నామలైయూనివర్సిటీ బోర్డు ఆఫ్ స్టడీసు ఇన్ తెలుఁగు. బళ్లారి.

మహాశయా! "ఆంధ్రవాచస్పత్యము" మీకింతవఱకు నెంతో వన్నెఁదెచ్చినది దానిని, డు చతుర్భాషా వాచస్పత్యముగ రచింపఁ బూనుట మెచ్చఁదగినది. భాషకు తనువే శబ్దార్థంబగుటచే, భాషనేమాత్ర మెఱిఁగినవారికిని, యెఱుంగఁ గోరు వారికిని, ఆవిద్యార్థివిపశ్చిద్వర్యులకును, నిఘంటువులని యుపయోగ మపారము గదా! అట్టి నిఘంటు వాంధ్ర సంస్కృత హిందీ యుర్దూ భాషల రచించుటచే నిపుడాయా భాషల వ్యవహరించు వారందఱును, మీ యీ ప్రయత్నము సఫలమగుటకును, మీరితోధిక వాఙ్మయ సేవఁ గావించుటకును, మీకుఁ జిరాయురారోగ్య శక్తుల నొసంగుటకును సర్వశక్తునికిఁ గైమోడ్చి, మీకును మీనిఘంటువునకును గృతజ్ఞులగుదురుగాక!

---

## బ్రహ్మశ్రీ బాలకవి మర్ల అప్పారావుగారు ఆర్యావటము, కాకినాడ.

### మహాశయా! మీ నిఘంటు రచన నన్నద్భుతానంద రసనిమగ్నుఁగాఁ జేసినది.

ఆంధ్రభాషయందు వ్యాపించియున్న పదజాలంబున కెల్ల భాషాభాగవిభజనము, తత్సమములకు తద్భవ నిరూపణము, అర్థాంతరరూపాంతర వివరణము, గూఢపద ప్రయోగ ప్రదర్శనము, ప్రధానపదముకడ నానార్థములు, ప్రత్యర్థమునకును నుభయ భాషలలోని పర్యాయ పదములు, సందర్భానుసారముగ వ్యాకరణవిషయ ప్రదర్శనము మొదలగు విషయము లెన్నియేనిఁగల్గి వాఙ్మయమునందు వ్యాపించియున్న వేద వేదాంగ వైదాన్తిక మీమాంసా వైద్య వాస్తు ధర్మశాస్త్ర పారిభాషిక సాంఘికార్థిక రాజకీయాది పదజాలంబులనెల్లఁ దత్తద్గ్రంథ విషయాది విమర్శనపూర్వకంబుగా గాలించి నిర్దుష్టముగను, నిష్కళంకముగను రచియింపఁబడి అకారాదిక్రమంబుగల్గి అక్షరాస్యుఁడగు ప్రతియాంధ్రునకును సులభముగ బోధపడునట్లుండి తనకుఁ దాన సాటియై నవనవోన్మేషంబున నొప్పుచు మఱల నీవాఙ్మయమునకు నిఘంటు నిర్మాణావసరము లేకుండఁజేయుచుఁ బండితులకుఁ బరమానందమై, విద్యార్థులకు ధియత్సురభియై, పాఠశాలలకుం బారిజాతంబై, కళాశాలలకుం గల్పతరువై, నిఘంటువులకెల్ల నిరుపమాన శిరోమణియై యాంధ్రహస్తంబులకెల్ల నమూల్యాభరణంబై భాషాయోషకు హారస్థానాయమానంబై యొప్పుచుండునన్న నతిశయోక్తిఁగాకుండునని నాయభిప్రాయము.

---

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

## పీఠిక.

—:o:—

శ్రీ శ్యామలకామశాస్త్రిగారు ఆంధ్ర విద్వాంసులకును, భాషాపోషకులకును చిరపరిచితులే. ఆయన రచించిన "ఆంధ్రవాచస్పత్యము" జనామోదం పొంది అందుల మొదటికూర్పు ప్రతులు త్వరలో ఖర్చు అయి, ద్వితీయముద్రణపు అవశ్యకత కల్గినది. దీని మొదటి ముద్రణకు ఆంగ్ల పీఠిక వ్రాయుటలో "శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు"ను చాల యేండ్ల క్రిందటనే రచించుటకు మహారాజాదరమున ప్రముఖ విద్వాంసు లారంభించినను పూర్తికాలేదని విచారం తెల్పితిని. ఈ లోగా పాఠకుల జ్ఞానదాహమును తీర్చుటకు "ఆంధ్ర వాచస్పత్య" ముపయోగించినది.

శ్రీ "సూర్యరాయాంధ్రనిఘంటువు" ప్రచురణ యీ లోగా కొంత ప్రగతి నొందినను, నేటికిని పూర్తికాకుండుట "శ్రేయాంసి బహువిఘ్నాని" అను సూక్తిని జ్ఞప్తికితెచ్చుచున్నది. కనుక ఆంధ్రవాచస్పత్య పునర్ముద్రణము ఆంధ్ర లోకమున కిప్పుడు నుపయోగకరమే అని తోచుచున్నది.

ఈ రెండు నిఘంటువుల పద్ధతిలో కొంతభేదమున్నందువల్ల రెంటికిని యేక కాలములోనే తగు ప్రచారముండవచ్చుననియు నా ఆశయము.

ప్రభుత్వమును, మదరాసు విశ్వవిద్యాలయమును తోడ్పడగ తమిళంలో సమగ్ర నిఘంటు వేర్పడినది. ఆంధ్రమునకట్టి యదృష్టము ఇంకను లభింపలేద నుట నేటికిని సత్యమే.

ఆంధ్రవాచస్పత్యములో అచ్చ తెలుగు పదములు పూర్వసాహిత్యపు శబ్దములునేగాక ఇప్పటి జనుల వాడుకపదములను గూడ చేర్చినారు. ఒకే శబ్దమునకు సంస్కృతంలోను తెలుగులోను గల వివిధార్థము లన్నిటిని చూపినారు. అవశ్యకమని తోచినచోట ఉదాహరణలను (క్లుప్తంగానే) ఇచ్చినారు. వైజ్ఞానిక పారిభాషిక పదముల నెన్నిటినో కామశాస్త్రిగారీ నిఘంటువులో చేర్చుట ఈ వైజ్ఞానికయుగంలో చాల ఉపయోగకరమైనది. ఇందులో సంస్కృతాంధ్ర శబ్దముల సంఖ్య క్రిందటికన్నను చాల హెచ్చినది. క్రొత్తగ కొన్ని మాండలిక పద

ములను చూపబడినవి. ఇది ఒకవిధంగా గీర్వాణాంధ్రములకు రెండింటి కోశమని చెప్పవచ్చు. ఆంధ్రభాషకు సంస్కృత ప్రాకృతములే ప్రకృతులని ఆంధ్ర పండితుల సంప్రదాయము. ఆంధ్రము ఆర్యభాషా కుటుంబములోనిది కాక ద్రావిడ భాషాకుటుంబములోనిదని కాల్డ్వెలు మున్నగు భాషావిజ్ఞులమతము. ఈ రెండిటి భిన్నవాదములను సమన్వయించుటకు ద్రావిడకుటుంబమంతయు ప్రాకృత భాషా భవమని ఆంధ్రము పైశాచివంటి ప్రాకృత శాఖలనుండి జనించి యుండునని డా॥ చిలుకూరి నారాయణరావుగారివంటి వప్యులగు ప్రముఖ విద్వాంసులు పై సంప్రదాయము నొకరీతిగ సమర్థించినారు. దాదాపు ఆంధ్రసాహిత్య రచన లన్నిటిలో సంస్కృతపదములు చాలమెండు. కాని ద్రావిడభాషాకుటుంబంలో అతి ముఖ్యమగు ప్రాచీన తమిళాంధ్రములలోని ప్రాంతీయ భాషలకు ప్రాకృత భాషలకు విశేష భేదముగలదు. అంకెలు, క్రియలు సర్వనామములు జనుల నిత్య కృత్యపు పదములు నేభాషకు ప్రాణమని వీటిలో ఆర్యద్రావిడభాషల మధ్య మొత్తంమీద చాల భేదమున్నదనియు గమనింపవలె. కనుక తెలుగుభాష సంస్కృత ప్రాకృతభవమను వాదము ఛాయపుసిద్ధాంతంగా నాకెంకను తోచలేదు. కాని ఆంధ్రులకు ప్రాకృత భాషికమగు ఉత్తర పశ్చిమ ప్రాకృతాలతో రెండువేల యేండ్లు అవిచ్ఛిన్నసంబంధ ముండెను. జైన బౌద్ధయుగమందు చాల శతాబ్దులు ఆంధ్రదేశమంతటను ప్రాకృతభాష సంస్కృత ప్రాకృత వాఙ్మయాల ప్రభావ మధికముగ నుండెను. ఈ చారిత్రిక కారణాలవల్ల ఆంధ్రభాషలో వేలకొలది శబ్దములేగాక సంస్కృత పాకృతాలలోనే సాహిత్య వృద్ధిజరిగినట్లు తోచును. ఇప్పుడున్న మొదటి ఆంధ్రగ్రంథములలోను సంస్కృత పదాల మధికముగ నున్నది. కనుక ఆంధ్రసాహిత్యకులకు సంస్కృత జ్ఞానము చాల ఆవశ్యకము. ఈ స్థితినిబట్టి ఈ నిఘంటువులో కామశాస్త్రిగారు గీర్వాణ పదములను వాటి వివిధార్థములనుగూడ పర్యాప్తముగ జేర్చుట యుక్తమే. ఆయాశబ్దములకు అందలి ప్రతియర్థమునకును పర్యాయపదములను గ్రంథవిస్తరముకు జంకక సమృద్ధిగ నిచ్చినందున, ఈ నిఘంటువు కవులకు, సాహితీసేవకులకును చాల యుపయోగించును. మరియు శబ్దార్థములతోపాటు ఉచితమగు చాలచోట్ల విశేషంగా విషయ పరిజ్ఞానపు అంశములనుగూడ చేర్చినారు. తరుచు వాడుకలోనున్న ఆంగ్లపదములను ఈ నిఘంటువులో చేరినవి. ఇంకను వివిధవిషయములను చేర్చుద్వారా దీనిని కొంతవరకు విజ్ఞానభాండారముగను జేయ యత్నము జరిగినది.

ఈ ముద్రణములోని మరొక విశేషము హిందూస్తానీ పదములను పూర్తిగ చేర్చుట. తెలుగుభాషలో హిందీపదములేగాక అమల్, అర్జీ, అసల్,

ఇలాకా, కరార్, కసరత్. కిఫాయిసీ, కిమ్మత్, కైద్, ఖజానా, ఖరీద్, ఖాళీ, ఖులాసా, గుమాన్, గులాం, చమ్చా, చాకరీ, చలాకీ, జనానా, జమాఖర్చు, జయూర్, జల్దీ, జామీను, జుమ్లా, జులుమ్, జేబ్, తకరార్, తమాం, తయార్, తరఫ్, తరహ్, తాకీద్, తాజా, తారీఫ్, తైనాతీ, దఖల్, దగా, దఫా, దరియాప్తు, దర్జీ, దానా, దావా, దుబారా, దోస్తీ, నజరానా, నఫా, నమూనా, నాజుక్, నామర్దా, నిశానీ, నౌకర్, పరవా, పాఖానా, ఫర్మానా, ఫసలీ, ఫాయిదా, [illegible]ద్, బదలీ, బరాబర్, బాలక్, బీమా, బురకా, మంజూర్, మజా, మదద్, మరమ్మత్, మామూల్, ముఖ్తసర్, ముజరా, మొహర్, మెహనత్, మెహర్బానీ, మురబ్బా, యకాయక్, రకమ్, రయత్, రివాజ్, రాస్తా, రోటీ, రోజ్, లాయర్, వకీల్, వాపస్, విలాయత్, శరీక్, శిస్తు, శికార్, శౌక్, సఫేద్, సర్కార్, సర్హద్, సలాహ్, సవాల్, సాఫ్, సాల్, సిపాహీ, సిఫారిశ్, సుస్తీ, హక్, హమేశా, హాజర్, హాల్, హుకుమ్, హుజూర్,

ఇట్టి అరబ్, పారసీ జనితమగు హిందూస్తానీ పదములు వేలకొలది తెలిసియు తెలియకయు, మన ప్రాంతంలో కొద్ది భేదాలతో జనులు వాడుచున్నారు. వాటిలో అనేకములకు వేరు తెలుగుపదాలు లేవు. మన దేశమునకు ఇటీవలనే స్వాతంత్ర్యము వచ్చినది. ఇంత్వరలోనే హిందూస్తానీ మన దేశము తటి జాతీయ భాష కాకతప్పదు. ఆంగ్లభాషా ప్రాముఖ్యము తగ్గుచు దేశంలో పరస్పర సమ్మేళనము హెచ్చుకొలది హిందూస్తానీ పదముల వ్యవహారము ఆ ద్రప్రాంతములో ఇంకముందింకను హెచ్చును. మరియు విశాలాంధ్రంలోని నిజాంరాజ్య వాసులగు సుమారు 80 లక్షలమంది తమ రాజభాషయగు ఉర్దు అను హిందూస్తానీని లౌకికావశ్యకముల కుపయోగించుటనువారితో అన్యోన్యతవల్లను గూడ ఆంధ్రుల మొత్తంమీద హిందూస్తానీ పదముల యర్థము తెలియుటకు సౌకర్యములు హెచ్చుటయు అవసరము. భారతదేశపు వివిధ సాహిత్యములను సమన్వయమును క్రమంగా హిందూస్తానీ ద్వారా జరుగును. కనుక హిందూస్తానీ నిఘంటువుల సహాయముతో దీని రెండవ ముద్రణలో శాస్త్రిగారు సమృద్ధిగ ఆ మాటల యర్థములను పర్యాయపదములనుగూడ ఉచితస్థాన మందిచ్చియున్నారు. మరియు వీలైనంతవరకు అవి అసలు ఏ భాషనుండివచ్చినవోగూడ తెలిపి శాస్త్రిగారు దీనిని హిందూస్తానీ నిఘంటువుగను చేసియున్నారు.

ఇట్లు మన మాతృభాష, సాంస్కృతికభాష, జాతీయభాష ఈ మూడింటి శబ్దజాలములను ప్రోగుజేసి మరియెన్నియో విశేషములనుగూడ సమన్వయించి శాస్త్రిగారు ఒక పెద్ద నిఘంటువును రచించినారు. భూరి ధనసహాయముతో వం

దీతమండలియే చేకొనుటకు కష్టమగు విపులకోశనిర్మాణపు ఈ మహాకార్యముకు సాధారణావకాశములేగల కామశాస్త్రిగారు పూనుకొనుట గొప్ప సాహసమే. అయినను నిరంతర క్లేశముకు అసౌకర్యములకు జంకక అహోరాత్రములు తదేక దీక్షతో కృషిచేసి "వాచస్పత్యము" ను పూర్తిచేసిన శాస్త్రిగారిని భాషాభిమానులు అభినందించ దగును.

ఈ గ్రంథములో లోపములు లేవని నా అభిప్రాయముకాదు. మానవుడు అల్పజ్ఞుడు. మఱియు ఎందరో పండితులు అనేక సాధన సంపదల సాహాయ్యముతో రచించిన వాటిలోనే లోపములుండునప్పుడు ఈ మనె ఒంటిగనే, కొలది శక్తిసాధనములతోనే కృషిచేయుచున్నప్పుడు చాలలోపములుండుట సహజము. కాని శాస్త్రిగారి ఉద్యమము, ప్రయత్నము. భక్తి, కృషి, నిర్వాహముగూడ గుర్తించగా ఈ రచన ఆంధ్రమహాజనుల యాదర ప్రోత్సాహములకు పాత్రమగునని నమ్ముచున్నాను.

ఇట్లు,

కొమాండూరి శఠకోపం. M. A. B.L.

కాకినాడ, ది 29—6—48. సం॥

---

# తొలిపలుకు.

—:o:—

బ్రహ్మశ్రీ పండిత నూకల నరసింహశాస్త్రి గారు. కూరాడ. కాకినాడ.

సృష్టికర్తశక్తి వర్ణనాతీతము. తనముద్దు బిడ్డల యందెన్ని శక్తులనో యొసంగి వారి క్రీడావినోదాదులం జూచి సదా మురియుచుండును. తాను సృష్టించిన మానవాభివృద్ధికి ననుకూల కోశకలితత్వ మెట్లవసరమో యట్లె సారస్వతాభివృద్ధికి ననుకూలకోశకలితత్వము ముఖ్యమని యెఱుంగును. కోశము కవికి కల్పతరువు.పండితునకు ధర్మాగారము. ప్రతివ్యక్తికిని కోశములు తగినన్ని సృష్టికర్తయొసగియున్నాఁడు. ఏవ్యక్తి యేకోశముల నెట్లుపయోగించు కొనవలెనో తగు యేర్పాటులను గానించియున్నాఁడు.

సమగ్రకోశము నపేక్షించుచున్న యీ యాంధ్రలోకమునకు పూర్వము గీర్వాణభాషకు "తర్కవాచస్పతి" యను మహాపండితుఁడు "వాచస్పత్యము"

అను మహాకోశమును రచించి చరితార్థు(డై యనన్యకీర్తి నందినట్లుగా నాంధ్ర విద్యావాచస్పతి, కావ్యనిధి, జ్ఞానగుణాకర, సాహిత్యసరస్వతి, ఆంధ్రవాఙ్మయ మహోదధి బిరుదాంకితులును నాకు గల బంధుకోటిలో ముఖ్యులును నగు బ్ర॥శ్రీ కొత్ర శ్యామలకామశాస్త్రిగారు "ఆంధ్రవాచస్పత్యము'' అను నీ యస ఘూన బృహత్కోశమును వ్రాసి మొదటిముద్రణము పూర్తిగావించి రెండువేల ప్రతులను లోకమున వెదజల్లి చరితార్థులగుటయేగాక మరల రెండవసారి ముద్ర ణము చేయ సమకట్టుట సంతోషదాయకము.

చాలవరకీ నిఘంటు ముద్రణాదులకు మహారాజులు జమీందార్లు భాషో ద్ధారకులతోపాటు మాగ్రామాధికారియు వెల్లయస్టేటు ప్రొప్రయిటరును అగు మ॥ వెలుగుబంట్ల నారయ్యగారున్ను తోడ్పడిరని వ్రాయుట నిఘంటుకర్తగారికిని వారితోపాటు నాకును సంతోషదాయకము.

ఈమహోన్నత నిఘంటువును లిఖించినవారు శ్యామలకామశాస్త్రిగారని యిదివరకే చెప్పియున్నాను. వీరి బిరుదములే వీరి ప్రజ్ఞను వేనోళ్ళ జాటు చున్నవి. అట్టియఖండపండితులు గావుననే యీయమూల్య నిఘంటువును తృప్తికరముగ విరచింపఁగలిగిరి. "తారానాథతర్కవాచస్పతి"చే విరచింపఁ బడిన వాచస్పత్యమువలెఁ దెనుఁగున నీయది యుపయోగించునని చెప్పుటకు సందియ మింతయు నుండనేరదు. అంతకంటె నెక్కుడనిగూడఁ జెప్పవచ్చును. కాన దీని కీయఁబడిన "వాచస్పత్యమ"ను పేరు సార్థకమైన దనవచ్చును.

ఇది తప్పకఁ బ్రతియింట నుంచుకొని సదావాడుకొని లాభము నొందఁ దగినది. ఆవిధముగా సమస్త విద్యాసంస్థలవారును ఈ నిఘంటురాజమునకుఁ దగువ్యాప్తిని సర్వవిధములఁ గలిగింపఁదగినది.

పరమేశ్వరుఁడీ యుద్గ్రంథరాజమును విరచించిన శ్రీ శాస్త్రిగారికిని ఈ నిఘంటు తల్లజమునకును శాశ్వతకీర్తి కలుగునట్లు సదా అనుగ్రహింపఁగాక యనిప్రార్థించుచున్నాఁడను.

తూ॥ గో॥ జిల్లా<br>కాకినాడతా॥,<br>కూరాడ.<br>30—7—48

ఇట్లు,<br>నూకల పట్టెన్నశాస్త్రి గారి కొమారుఁడు<br>నరసింహశాస్త్రి

# నిఘంటుకర్త విజ్ఞప్తి.

1. సమస్త విద్యలకుఁ బుట్టినిల్లయి సరసులకు సంతోషమొనఁగూర్చు సంస్కృతభాష సర్వోత్కృష్టగుణాతిశయంబులతో వెలుంగుచున్నదిగదా! ఆబాసకు ముద్దుపట్టియనందగు తెనుఁగుబాసయెంతకాలము తన తల్లిపోకడలననుసరించి విలసిల్లుచున్నదో యంతకాలముఁ బండితుల యౌఁదలల నూఁపించు వాసివన్నెలఁజెన్నలరఁ గలదని రసజ్ఞులకు వేఱచెప్పనక్కఱలేదు.

2. ప్రపంచంబునందును వాఙ్మయప్రపంచంబునందును సామాన్యంబుగ సంచరించు మానవకోటికిఁ బదార్థంబులెంత యావశ్యకములోఁ బదార్థంబులునంత యావశ్యకంబులే. అట్టిపదార్థంబులనెల్లఁ బ్రోఁగుసేసి కోశంబులుగా నెలకొల్పి తత్తదుపయోగ విధంబులు సర్వజనసామాన్య సౌఖ్యావహంబులుగాఁ గావించుకొనుట ప్రధానకర్తవ్యమని యాచరణసిద్ధము. కనుకనే ప్రపంచాధికారులతోఁబాటు భాషాప్రపంచాధికారులును నమూల్యములగు పదార్థములతోఁ గోశంబుల సంతరింపసమకట్టిరి.

3. లోకముసౌఖ్యమునే చూచుచుండును. నిఘంటురచన ప్రారంభించి సూక్ష్మదర్శులయిన పండితులు కొలఁదికాలమునకే భాషాకూలంకషంబులై యనర్ఘములయిన కోశములచే వాఙ్మయము వశపఱచుకొనిరి. నాఁడునాఁటికి నుద్భవించు నిఘంటువు లొకదానికొకటి చిన్నమెత్తుం దీసిపోవక నానార్థంబుల నొసంగి వాడుకొనుచితంబెఱింగించి యావ్యాంధ్రభాషాపాఠకులగుఁ గవికుమారులకు వీసమంతయైనఁ గష్టంబుఁ గలిగింపవయ్యె.

4. అదియట్లుండఁ దల్లిచాటున నేలోటును లేక నీటుదేఱిన మనతెలుఁగుకన్నెకుఁ బ్రాయమంకురించినది. నింపుసొంపుల బెంపలరు పరువంపు జవ్వనంబున మవ్వంబుఁదీరి కలువలచెలువుఁ దుళికించు నోరచూపులవలపునిలుపు సొంపున రసికవిసరంబులఁ గరఁగింప నేర్పలవడినది. నాఁడుమొదలు తల్లిని విడిచి యొంటినుండ నేర్చినది. స్వయముగాఁ గోశసంపాదనకుఁ దన పుత్రులఁ బ్రోత్సహించినది.

5. అట్టిసమయముననే (1900-1906) శ్రీశ్రీ మాతండ్రిగారయిన కాట్రలక్ష్మీనారాయణశాస్త్రిగారు "లక్ష్మీనారాయణీయము" ను పేరిట శుద్ధాంధ్రప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువును సంఘటించి తెలుఁగుకవికొమారుల కోశదారిద్ర్యముఁదీర్చిరి. సకలాంధ్రలోకచంద్రికాయమానమైనదానికీర్తిని నేను వేఱ పొగడసాహసింపను.

6. నేఁటికి శబ్దరత్నాకర శ్రీసూర్యరాయాం

ధ్రాది నిఘంటువులు పదపదార్థమున కెన్నియేని నిలువంబడి యున్నవి. అయినను వానిలో నొక్కటియుఁ బర్యాయము లగు పదములనెల్లఁ దెలుప సాహసింప లేదు. ఏలయన? నొకమాటకు సరియయినమాట లాద్యాంధ్రములనెన్నెన్నియో యుండును. అవియన్నియు నొక్కచోటకు నొక్కఁడు క్రోడీకరించి వ్రాయవలయునన్న నెంత గ్రంథ సామగ్రి యుండవలయునో యెంత కాలముపట్టునో యెంత పాండిత్యము గావలయునో యెంత యోపిక యుండవలయునో యెంతధారణ యుండవలయునో యెంత పరిశ్రమ చేయవలయునో యాలోచించినఁ బాఠలకుకే తెలియఁ గలదు.

7. అయినను "నసాహసమనారుహ్యనరోభద్రాణి పశ్యతి" యను చొప్పున నీ ఘనకార్యమునకు నేనొక బడిపంతుల నయి యుండియుఁ జొరవఁ జేసికొని, మహత్కార్యముల పట్లఁ గృతజ్ఞతను జూపు మహోదారు లాంధ్ర దేశంబున లేకపోవరను దలంపున నెట్టకేలకుఁ బండితజన సాహాయ్యంబున నీనిఘంటు రాజమును దలఁచినరీతి నాంధ్రప్రతిపదార్థ పర్యాయపదము లనోదాహరణంబుగానంతరించి 1910 - 1934 వఱకును వ్రాసి 1934 - 1940 తో ముద్రణము పూర్తిగావించి 1945 తో ముద్రింపించినరెండువేల ప్రతులును లోకమున వెదజల్లితిని. ఇందులకుఁ దోడ్పడిన నిర్హేతుక పరమేశ్వర కరుణాకటాక్ష విలాసంబున కన్వహంబుఁ గృతజ్ఞుఁడను.

8. ఇప్పుడీ రెండవ ముద్రణమున శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులు M. A. B. L.గారు పీఠికను బ్ర॥శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి M.A.B.L.B.T.P.గారు ఆంధ్ర వాఙ్మయ సింహావలోకనమును బ్ర॥ శ్రీనూకల నరసింహశాస్త్రి గారు తొలి పలుకును వ్రాసి ద్విగుణీకృతోత్సాహ మొసఁగి నన్నుం గృతార్థుంజేసి నందుల కెంతయు సంతసించి వారికిఁ గృతజ్ఞతతో వందన సహస్రంబు లర్పించు చున్నాఁడను.

9. ఈ రెండవ ముద్రణమునకు 1946 జనవరి మొదలు చేరినచందాదారులు ఇది గొప్ప సంస్థయని యెఱింగియు కాకితపు కంట్రోలు బాధ తగ్గినది అనువలకు ఓరిమి వహించి నన్నిపుడు మఱల ప్రోత్సహించినందుల కెంతయు సంతసించి వారికిఁ గృతజ్ఞతతో వందన సహస్రంబు లర్పించుచున్నాఁడను.

10. ఈ రెండవముద్రణమునకు విశేష పరిశ్రమకోర్చి సర్వవిధములతోడ్పడి పూర్తిగావింతునని కొన్నినియమము

లంజేసికొని ప్రోత్సహించిన బ్రహ్మశ్రీ సూకల నారాయణశర్మగారి యెడల నేనెంతయు కృతజ్ఞుఁడనై వారికాయురారోగ్య భోగభాగ్యాదులొసంగ పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడను.

11. ఈ ఆంధ్రవాచస్పత్యము యొక్క రెండవ ముద్రణమున్ను హిందూస్తానీవాచస్పత్యము యొక్క మొదటి ముద్రణమున్ను యీపాటికి పూర్తికావలసినవే. కాని యీరెండవ ముద్రణమును గుఱించి నాకును మద్రాసు పేపరుకంట్రోలరుగారికిని 1946 సం॥ జనవరి నెల నుండియు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరముల ఫలితము 1948 సం॥ మే నెలాఖరునకు సఫలమైనందున ముద్రణారంభము చేయఁ గలిగితిని. ఓరిమి పట్టిన చందాదారుల యెడల నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

12. "హిందూస్థానీ తెనుఁగు వాచస్పత్యము" దీనితోపాటుగనే ప్రత్యేకముగ ముద్రింపఁబడుచున్నది. అదియును ఓరిమిపట్టిన చందాదార్లకు త్వరలోనే చేరఁగలదు.

13. "ప్రమాదో ధీమతామపి" యను నుడువు నెఱింగిన బుద్ధిశాలులు నాయీ మహత్కార్యమునఁ గలట్టి దోసఁగులమన్నింతురని తలంచుచున్నాఁడను.

14. నాయీ మహత్కార్యమునకు కావలసిన ద్రవ్యమునుగుఱించిప్రశంసించిన తక్షణమే తోడ్పడిన వెల్లయస్టేటు ప్రొపయిటరుగారును కూరాడమామిడాడ గ్రామముల కర్ణీకార్లును నగు మహారాజశ్రీ పండిత శ్రీ వెలుగుబంట్ల నారయ్యగారి యెడల నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. వారినివారి కుటుంబమును పరమేశ్వరుఁ డాయురారోగ్య భోగభాగ్యాదులతో సదా రక్షించుఁగాక యని ప్రార్థించు చున్నాఁడను. ఆయనయే నాకు మార్గదర్శకులని మరల మనవి చేయుచున్నాను.

15. నా యీ మహత్కార్యమునకు మహారాజశ్రీ "సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు" KT., Hon. D. Litt. Vice - chancellor, Andra University Waltair. 9-12-46 తేదీనే మార్గదర్శకులై మొట్టమొదటనే ప్రోత్సాహకులై పోషకులై తమ చందా లేఖను బోణీచేసిరి. నన్నిట్లు ప్రోత్సహించిన శ్రీ వారియెడల నేనెంతయుఁ గృతజ్ఞతతో వందన సహస్రంబు లర్పించు చున్నాఁడను.

మంగళమహత్.

కరప,
కాకినాడతాలూకా.
30-7-48

ఇట్లు, బుధజన విధేయుఁడు,
ఆంధ్రవిద్యా వాచస్పతి,
కొట్ర శ్యామలకామశాస్త్రి
నిఘంటుకర్త.

# నియమవిధానక్రమము.

—:౦:—

1. ఈ నిఘంటువు నందలి పదము లన్నియు అకారాదిహకారాంతము వఱకు ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును.

2. ప్రతి అర్థమునకును అకారాది హకారము వఱకుగల పర్యాయ పదములు తద్విశేషములతో ప్రాసాక్షరాదినియమములతో వ్రాయఁబడును. (చూ: తృణము, ధాన్యము, ధేనువు, మత్స్యము, యుద్ధము, వాయువు, సదనము, సర్పము, స్వరము, హయము మొ.)

3. కకారము తరువాత క్ష కారమును, ల కారము తరువాత ళ కారమును వ్రాయఁబడును.

4. సంస్కృతపదములకుప్రత్యయములుఁ జేర్చి (తత్సమ రూపములు)వ్రాయఁబడును.

5. ఇందునిర్దుష్టమగు సంస్కృత పదములురమారమి 50,000ను, తెనుఁగు పదములు మున్నగునవి 50,000 ను కలసి ఒక లక్ష పదములవఱకు కలవని అంచనా వేయఁబడెను.

6. ప్రతి పదమునకును భాషాభాగమును, అర్థమును, గూఢ పదములకు ప్రయోగములును, నానార్థములును, ప్రత్యర్థమునకు పర్యాయపదములును, విశేషించి తద్విశేషాదులును వ్రాయఁబడును.(చూ:అ,అంకము, అంగము, వాయువు, వీణె, సదనము, సర్పము, స్వరము. స్త్రీ. హయము మొ.)

7. మఱియు తత్సమము (వికృతి)లకు తద్భవము (వైకృతి)లును, తద్భవములకు తత్సమములును = గుర్తుతోను, రూపాంతరములు — గుర్తుతోను గనుపఱుపఁబడును. (చూ: అంచ=హంస;కుడ్యము=గోడ;బమ్మ =బ్రహ్మ; గృహము=గీము: మొ.)

8. పర్యాయ పదములు శీర్షికాపదము లయినపుడు పైస వ్రాయఁబడిన వివరణాదులను వ్రాసి పర్యాయపదము లగుదిని,తద్విశేషాదులనుగనుఁగొనుటకై తద్గణాద్య పదతదర్థసంఖ్యలను :చూ, అను గుఱుతుతో సూచింపఁబడును. (చూ: అ, అమ్. అంకము, అంగము మొ.)

9 వేఁట. యుద్ధము మొ. వివిధ వృత్తులకును, ప్రకృతి శాస్త్రములు, గణితము, ధర్మశాస్త్రము, జ్యోతిషము వైద్యము, భూగోళము,వ్యాకరణము, సంజ్ఞావివరణములు, న్యాయములు, జాతీయములు మున్నగు వివిధశాస్త్ర

ముఁ కును సంబంధించిన పారి భాషిక పదములును, వ్యావహారిక పదములును, అకారాదిగ సాహిత్య పదములతోఁ కలఁబోసికూర్పఁబడును. (చూ: అలంకారము, అంగము, అంకోలబీజన్యాయము, అఁదెవేసిన చేయి మొ.)

10. చెట్టునకు * గుఱుతు చూపఁబడినది. (చూ: కొబ్బరి, మామిడి, మొ.)

11. ఇందుఁ గ్రియాపదములకు ధాతు రూపములును, నామపదములకుఁ బ్రథమైకవచనరూపములును వ్రాయఁబడును.

12. సంస్కృత, వైకృత, దేశ్య, గ్రామ్య, వాడుక, పారిభాషిక, జాతీయ, ఉపసర్గవీనికాయాయి సంజ్ఞ లిడఁబడును. నిర్దిష్టమగు అన్యదేశ్యము దేశ్యముగాఁ జేర్పఁబడినదిగాన దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.

13. ద్వయమునకు అవయవములైన పదములయొక్క సంజ్ఞలను ఆ యా శబ్దములకడఁ జూచునది. అనఁగా "అందాఁక" అనుచో అంత శబ్దము యొక్క సంజ్ఞను అంతకడను. దాఁక శబ్దముయొక్క సంజ్ఞను దాఁకకడను జూడవలయునని యర్థము. ఇట్లు తక్కిన చోట్లను దెలియవలయును (వైకృతమును దేశ్యమును మిశ్రమమైన పదము)

14. ఒక్కొకచో నింపక రూపభేదము గల శబ్దము దానిమొదటి రూపను కడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ: అకటవికటము, ఒకతె. మొ)

15. ఒక్కొకయెడ 'ము వర్ణాంత' రూపము ముపర్ణములేనిశబ్దరూపము కడనే రూ-అని వ్రాయఁబడును. (చూ. అగ్గలిక. మొ)

16. కొన్నచోట్ల తెనుఁగు పదమునకు ఇ యాంతరూపము, ఏదంతరూపము రెండునువ్రాయఁబడును. కొన్నియెడల ఇయాంత రూపముకడ ఏదంత రూపమును, ఏదంత రూపముకడ ఇయాంత రూపమును వ్రాయఁబడును. (చూ: అందకత్తియ; అగిసియమొ; మఱియు అటె-అటొ- మొదలగు వాని భేదములను గుర్తింప వలయును.)

17. ఉకారలోపముగల అల్లు లోనగు వాడుకలోని పదములు ఒక్కొకయెడ ప్రత్యేకముగ వ్రాయఁబడవు. (చూ: అలుగు మొ.)

18. దేశ్యక్రియల యందు ఇంచుక్క పచ్చెడు సామాన్య ప్రేరణ రూపములు ప్రత్యేకముగా వ్రాయఁబడును. (చూ: అడఁగించు, ఇప్పించు మొ.)

19. తేటగాఁ దెలియఁదగు చోట్ల తఱుచుగ దెనుఁగు పదములకు సంస్కృత పదములతోఁడను, సంస్కృతపదములకుఁ

దెనుఁగుపదములతోడను అర్థములతో వ్రాయఁబడును.

20. ఒకపదము సంస్కృతముగాను తెనుగుగాను నున్నయెడల ముందు సంస్కృతార్థములను వెనుక తెనుఁగర్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడిఅంకెలను, తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలను గుఱుతిడఁబడును. (చూ: అం. అంకము. అంగము మొ.) ఇటులనే ఒక పదము తెనుఁగుగాను సంస్కృతముగాను నున్నయడల ముందు తెనుఁగర్థములను వెనుక సంస్కృతార్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలను, సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడిఅంకెలను గుఱుతిడఁబడును. చూ: మ్రుక్కు.

21. ఒక పదము విశేష్యము, విశేషణము, సర్వనామము, అవ్యయము, క్రియ అగునెడల ముందు విశేష్యార్థములను, వెనుక విశేషణార్థములను. నా వెనుక క్రియార్థములను వ్రాయఁబడును (చూ:అంటు, ఎత్తు ఒడ్డు మొ)

22. ఇందుఁ గొన్నిటికి గ్రంథ విస్తర భీతిచే ప్రయోగములు సంగ్రహముగ వ్రాయఁబడి యుండుటవలన ఇందు వ్రాయఁబడినఅర్థములకు సందేహములు కలిగినయెడల ఆ యుదాహరణములకు ముందు వెనుకలను ఆ గ్రంథములయందు విశదముగఁ జూచుకొనవలయును.

23. ప్రయోగములు దొరకియు పాఠభేదములతోఁ గూడియుండుటవలన నట్టిచోట్ల ఆశ్వాసాది పద్యసంఖ్యలు వ్రాయఁబడును.

24. చదివెడి వారికిఁ జక్కగాఁ దెలియుటకై యిందు అర్థము లోనగునది తఱుచుగ సంధిలేక వ్రాయఁబడును. నియమ బాహుళ్యముచే నీ క్రమము కొన్నియెడలఁ దప్పినను దప్పియుండును.

25. క్రొత్తగ నచ్చుటచ్చుటఁ జేరిన నియమవిధానాదులను పాఠకులాయా సంవత్సరాదులంబట్టి గ్రహించుకొవలయును.

26. తెనుఁగున వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయాది శబ్దములు కొన్ని చేర్పఁబడినవి. ఇట్టి పదములకు గ్రంథ దృష్టాంతాదులు దొరకుట దుస్సాధ్యము. అవి వాడుక యందున్నట్లే గ్రహింపవలయును.

27. రూపాంతరములలో కొన్నిమాత్రమచ్చుటచ్చుట శీర్షికాపదములుగ నీయక నా యా పదముల కదనే చూపఁబడినవి.

28. గ్రంథ సంకేతాది పట్టికయందుఁ జేరని గ్రంథములు పెక్కులుం

డును. అట్టిచోట్ల నా యా గ్రంథముల పేర్లు వ్రాయఁబడును.

29. సంజ్ఞావివరణపట్టిక యందుఁ జేరని గుఱుతులు మెండుగ నుండును. అట్టిచోట్ల వాడుకను బట్టి తెలిసికొనవలయును.

30. ప్రబంధాదులు పెక్కు ముద్రణాలయములయందు ముద్రింప బడిన కారణమున పాఠభేదములు వ్రాయనలవి కానన్నిఁ గాన్పించుచున్నవి. తాళపత్రగ్రంథములు పెద్దలు పెక్కు మంది వ్రాసిన కారణమున వాటియందు పాఠభేదములు విశేషముగఁ గాన్పించుచున్నవి. ఆ కారణమునఁ గొన్నిచోట్ల సుశబ్దాపశబ్ద నిర్ణయమును, అర్థనిర్ణయమును దుస్సాధ్యముగనున్నది. అట్టిచోట్ల అట్టి పదములు గల పద్యము లుదాహరింపఁయే నా బుద్ధికిఁ దగినరీతిని అర్థ నిర్ణయాదులను వ్రాసితిని. అట్టిచోట్ల పాఠకులకు గ్రంథ పరిశీలన మవసరమగునేని చూచుకొనుట కనువుగ నట్టి ప్రబంధాదుల యొక్క ఆశ్వాసాదులను పద్యములయొక్క సంఖ్యను వివరించి పాఠకమహాశయుల కాపరిశ్రమ వదలివేసితిని. (ఉ॥ నేను స్వయముగప దెన్మిందువిధములగుతాళపత్ర, అచ్చుభారత ప్రతులనొకదానితో నొకటి పరిశీలింపఁగ నైదువేల పదములకు పాఠభేదములఁ గాన్పించినవి.)

31. మొదటి ముద్రణము రెండువేల ప్రతులను అచిరకాలములోనే ఆంధ్రమండల మంతయు స్వీకరించుట వలనను, రెండవముద్రణమునకు ఆంధ్రమండల మంతయు ద్విగుణీకృతముగ ప్రోత్సహించుటం బట్టియు నీ పునర్ముద్రణమునకు సాహసించితిని.

32. బుద్ధిమంతు లిందుల పొరపాట్లు తెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుం జేయుదురని ప్రార్థించెద.

ఇట్లు,

నిఘంటుకర్త.



# సంజ్ఞావివరణపట్టిక.

| సంకేతములు | వివరణములు |
|---|---|
| అ. | అకారాంతము. (ఇట్లు ఆ, ఇ. ఈ, ఉ, ఊ. ఋ, ఐ, ఓ,ఔ, చ్, జ్, త్, ద్, థ్. న్. ప్, భ్, ర్, వ్, శ్, ష్.స్. హ్. అనువర్ణములు గలచో ట్లఆయాఅంతములుగాచెప్పు కొనవలెను, ఉదా.—అకారాంతము, ఇకారాంతము, ఈకారాంతము, చకారాంతము, జకారాంతము, తకారాంతము అని.) |
| (అ. ఆ. ఆ.) | పుంలింగవిశేషణమైనప్పుడు, అకారాంతము. (స్త్రీలింగ విశేషణమైనప్పుడు) ఆకారాంతము, లేక ఈకారాంతము. (నపుంసకలింగ విశేషణమైనప్పుడు) అకారాంతము. |
| అం. | అంకము (సంజ్ఞావివరణము.) |
| అం, ప్రే. | అంతర్భావిత ప్రేరణము. |
| అ.క్రి. | అకర్మక క్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపదము(ఆగమము మొ॥) |
| అప్ర. | అప్రసిద్ధము. |
| అలం. | అలంకారములు. |
| అవ్య. | అవ్యయము. |
| ఆత్మ. | ఆత్మనేపది. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | (తెనుఁగు పదములకు ముందున్నచో) ఉపపదము(అపి, ఉద్ద, ఎగ. మొ.)( సంస్కృత పదములకు ముందున్నచో) ఉపసర్గము. (ప్ర. మొ.) |
| ఉభ. | ఉభయము. (కొన్నియర్థముల యందు అచ్చ తెనుఁగును, కొన్ని యర్థములయందు సంస్కృతమునైనపద ) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క్రి | క్రియ. |
| క్రి. విశ. | క్రియావిశేషణము. |
| గ్రా. | గ్రామ్యము. (అనింద్యము.) |
| చూ. | చూడుము. (సంస్కృత, తెనుఁగు పర్యాయపదముల కొఱకు.) |
| ఛం. | ఛందశ్శాస్త్రము. |
| జా. | జాతీయము. (దేశీయము.) |
| జ్యో. | జ్యోతిశ్శాస్త్రము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తద్వి. | తద్విశేషములు. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| (తె. ప) | తెలుఁగు పర్యాయపదములు. |
| దే. | దేశ్యము. |
| ద్ర. | ద్రుతాంతావ్యయము. |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వ. | ద్వయము(వైకృతమును దేశ్యమును మిశ్రమైన పదము.) |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో |

| సంకేతములు | వివరణములు | సంకేతములు | వివరణములు |
|---|---|---|---|
| | అంతర్భూతము ) | యోగ. | యోగశాస్త్రము. |
| ధర్మ. | ధర్మశాస్త్రము. | రూ. | రూపాంతరము. |
| ధా. లేక క్రి. | ధాతువు (క్రియాపదము) | వా. | వాడుక. |
| న. | నపుంసకలింగము. | వి. | విశేష్యము. |
| నాటక. | నాటకపరిభాష. | విణ. | విశేషణము. |
| నాట్య | నాట్యశాస్త్రము. | వు. | వువర్ణకాంతము. |
| ని. | నిపాతము. | వై. (లేక) తద్భ. | వైకృతము (తద్భవము)(ప్రాకృతసమమును సంస్కృత ప్రాకృత భవము నైన పదము.) |
| న్యా. | న్యాయము. | | |
| పర. | పరస్మైపది. | | |
| పా. | పారిభాషికపదము. (ఉదా:- పుష్పసమూహ పరిణామ ఫలము.)=అనాస. మొ) | వైద్య. | వైద్యశాస్త్రము. |
| | | వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| పాఠా. | పాఠాంతరము. | వ్యవ. | వ్యవహారము. |
| పీ. | పీఠిక. | వ్యు. | వ్యుత్పత్త్యర్థము. |
| పు. | పుంలింగము. | వ్యాక. | వ్యాకరణము. |
| పుం. న. | పుంనపుంసకలింగము. | శస్త్ర. | శస్త్రంతము. |
| పుం, స్త్రీ | పుంస్త్రీలింగము. | శబ్. | శబ్దకరణము. |
| —వై.— | వైయర్థాదులే. | సం. | సంస్కృతసమము (తత్సమము.) |
| ప్ర. | ప్రత్యయము. | | |
| ప్రా. | ప్రాకృతము. | సంగీత | సంగీతశాస్త్రము. |
| ప్రే. | ప్రేరణము. | సర్వ. | సర్వనామము. |
| బ. | బహువచనాంతము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| బీజగ. | బీజగణితము. | (సం. ప.) | సంస్కృత పర్యాయ పదములు. |
| మంత్ర. | మంత్రశాస్త్రము. | | |
| మి. | మిశ్రము (సంస్కృతాంధ్రములు కలిసిన శబ్దము) | సా. | సామెత. |
| | | స్త్రీ. | స్త్రీలింగము. |
| ము. | మువర్ణకాంతము. | = | ప్రకృతి వికృతులు గుఱుతు. |
| మొ॥ | మొదలైనవి. | * | వృక్షలతాది వాచకమగుటను తెలియఁ జేయును. |
| యు. | యుగళము. (కొన్ని యర్థముల యందు దేశ్యమును కొన్ని యర్థములయందు వైకృతము నైన పదము.) | ... | ఈ గుఱుతు నడుమ కొన్ని యక్షరములుండును. |
| | | | (మిగతవి స్పష్టము.) |

# విమర్శక గ్రంథ సంకేతాది వివేచన పట్టిక.

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| | | సంస్కృతనిఘంటువులు. |
| 1 | ఆ. ని. | ఆప్టేని సంస్కృతాంగ్ల నిఘంటువు. |
| 2 | అభి. | అభిధానరత్నమాల. |
| 3 | అమర. | అమరకోశము. |
| 4 | అ. పా. | అమరపదపారిజాతము. |
| 5 | త్రి. శే. | త్రికాండశేషము. |
| 6 | ధన్వ. ని. | ధన్వంతరి నిఘంటువు. |
| 7 | నా. ర. | నానార్థరత్నమాల. |
| 8 | నా. సం. | నానార్థార్ణవ సంక్షేప నిఘంటువు. |
| 9 | బ్రౌ. ని. | బ్రౌణ్యనిఘంటువు. |
| 10 | మే. కో. | మేదినీ కోశము. |
| 11 | రా. ని. | రాజనిఘంటువు. |
| 12 | వాచ. ని. | వాచస్పత్య (తారానాథ తర్క) నిఘంటువు. |
| 13 | విశ్వ. | విశ్వకోశము. |
| 14 | వై. ని. | వైజయంతీ నిఘంటువు. |
| 15 | శ. క. త. | శబ్దార్థకల్పతరువు. |
| 16 | శ. కల్ప. | శబ్దకల్పద్రుమము. |
| 17 | శా. ని. | శాశ్వతనిఘంటువు. |
| 18 | సం. ఆం. | సంస్కృతాంధ్ర నిఘంటువు. |
| 19 | స. సం. | సర్వశబ్దసంబోధిని. |
| 20 | హారా. | హారావళి. |
| | | మిశ్రాంధ్రనిఘంటువులు. |
| 21 | ఆం. వా. | ఆంధ్ర వాచస్పత్యము (మొదటి ముద్రణము) |
| 22 | ఆం. దీ. | ఆంధ్ర దీపిక. |
| 23 | పురు. క. | పురుషోత్తమకవీయము. |
| 24 | శబ్ద. ర. | శబ్దరత్నాకరము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 25 | శ. చం. | శబ్దార్థచంద్రిక. |
| 26 | సూ. ని. | శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| | | అచ్చతెనుగు నిఘంటువులు. |
| 27 | లక్ష్మీనా. | లక్ష్మీనారాయణీయ నిఘంటువు. |
| 28 | వైకృ. | వైకృత దీపిక. |
| 29 | శు. పా. | శుద్ధాంధ్రపదపారిజాతము. |
| 30 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము. |
| 31 | ఆం, ప. | ఆంధ్ర పదాకరము. |
| 32 | ఆం. శే. | ఆంధ్రనామశేషము: |
| 33 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము |
| 34 | వేం. ఆం. | వేంకటేశ్వరాంధ్రము. |
| 35 | సాంబ. | సాంబ నిఘంటువు. |
| 36 | చి. సూ. | చిన్నయ సూరిగారి నిఘంటువు (ఆ. సా. పరిషత్తులో). |
| 37 | బాల. | బాలచంద్రోదయము. |
| 38 | ఆం. భూ. | ఆంధ్రభాషాభూషణము. |
| 39 | ఆం.. సర్వ. | ఆంధ్రవిజ్ఞానసర్వస్వము. |
| | | ప్రకృతిశాస్త్రములు. |
| 40 | భౌ. | భౌతికశాస్త్రము(వై.న) |
| 41 | రసా. | రసాయన,,-(వే.వి.శర్మ) |
| 42 | మ. యు. | మహమ్మదీయ మహాయుగం (కో. వె. ల) |
| 43 | ప. వి. | పదార్థవిజ్ఞాన శాస్త్రం (మం. సా.) |
| 44 | ఆం. చ, | ఆంధ్రులచరిత్ర (చి॥ వీ॥) |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 45 | వ్య. శా. | వ్యవసాయశాస్త్రము(గో జో.) |
| 46 | ప. వా. | పరిణామవాదము (చి॥కీ) |
| 47 | వృ. శా. | వృక్షశాస్త్రము (టి.సా.) |
| 48 | శా. శా. | శారీరశాస్త్రము (వి.చం) |
| 49 | జం. శా. | జంతుశాస్త్రము(ఆ. ల.) |
| 50 | స్వీ. చ. | స్వీయచరిత్ర. (కం॥వీ॥) |
| 51 | హి. మ. | హిందూ మహాయుగము (కొ. వె. ల) |
| 52 | అ. శా. | అర్థశాస్త్రము (సి. రా. రెడ్డి.) |
| 53 | శా. పరి. | శాస్త్రపరిభాష.(ది. వెం. శి.) |
| | | గ్రంథస్థమగు వేదములు శాస్త్రములు మొ॥ |
| 54 | వ్యా. | వ్యాకరణము. |
| 55 | వేద. | వేదములు. |
| 56 | నిరు. | నిరుక్తము. |
| 57 | జ్యో | జ్యోతిషము. |
| 58 | కల్ప. | కల్పము. |
| 59 | ఛంద. | ఛందస్సు. |
| 60 | మీమాం. | మీమాంస. |
| 61 | న్యాయ. | న్యాయశాస్త్రము. |
| 62 | పురా. | పురాణములు. |
| 63 | ధర్మ. | ధర్మశాస్త్రము. |
| 64 | ఆయు | ఆయుర్వేదము. |
| 65 | పాక | పాకశాస్త్రము. |
| 66 | అర్థ | అర్థవేదము. |
| 67 | కామ. | కామశాస్త్రము. |
| 68 | ధను | ధనుర్వేదము. |
| 69 | మల్ల | మల్లశాస్త్రము. |
| 70 | గజ | గజశాస్త్రము. |
| 71 | వ్యూహ | వ్యూహశాస్త్రము. |
| 72 | అశ్వ | అశ్వశాస్త్రము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 73 | పురు. సా. | పురుషసాముద్రికము. |
| 74 | స్త్రీ. సా. | స్త్రీసాముద్రికము. |
| 75 | గాంధ | గాంధర్వవేదము(రాగ. తాళ). |
| 76 | భావా. | భావాధ్యాయ ప్రమేయము. |
| 77 | అలం | అలంకారములు. |
| 78 | నాటక | నాటకలక్షణము. |
| 79 | కావ్య. | కావ్యలక్షణము. |
| 80 | ఛందో. | ఛందోలక్షణము. |
| 81 | భరత. | భరతశాస్త్రము. |
| 82 | చతు. | చతుష్షష్టి విద్యావివరణము. |
| 83 | క్షే. గ. | క్షేత్రగణితము. |
| | | ఆంధ్రలక్ష్యగ్రంథములు. |
| 84 | అచలా. | అచలాత్మజా పరిణయము. |
| 85 | అచ్చ.భా. | అచ్చతెనుగుభారవి. |
| 86 | అచ్చ. రా. | అచ్చతెనుగు రామాయణము. |
| 87 | అధ్యా. | అధ్యాత్మ రామాయణము. |
| 88 | అని. | అనిరుద్ధచరిత్రము. |
| 89 | అప్ప | అప్పకవీయము. |
| 90 | అ. మ. క. | అష్టమహిషీకళ్యాణము. |
| 91 | అహ. | అహల్యాసంక్రందనము. |
| 92 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము. |
| 93 | ఆము. | ఆముక్తమాల్యద. |
| 94 | ఇందు | ఇందుమతీపరిణయము (సూ.) |
| 95 | ఇందు. రా. | ,, (రామభద్రకవి) |
| 96 | ఉ. రా. | ఉత్తరరామాయణము. |
| 97 | ఉ. హరి. | ఉత్తరహరివంశము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 98 | ఉ.హరిశ్చ | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము. |
| 99 | కకు. | కకుత్స్థవిజయము. |
| 100 | కలు. శ. | కలువాయిశతకము. |
| 101 | కవిక. ర. | కవికర్ణరసాయనము. |
| 102 | క. చౌ. | కవిచౌడప్పశతకము. |
| 103 | క. రం. | కవిజనరంజనము. |
| 104 | క. జ. | కవిజనాశ్రయము. |
| 105 | క. రాజ | కవిరాజమనోరంజనము. |
| 106 | క. స. | కవిసర్పగారుడము. |
| 107 | క. పూ. | కళాపూర్ణోదయము. |
| 108 | కా. సం. | కావ్యాలంకార సంగ్రహము. |
| 109 | కాశీ. | కాశీఖండము. |
| 110 | కాళ . | కాళహస్తిమహాత్మ్యము. |
| 111 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. |
| 112 | కిరా | కిరాతార్జునీయము. |
| 113 | కుచె | కుచేలోపాఖ్యానము. |
| 114 | కువల | కువలయాశ్వచరిత్రము. |
| 115 | కుమార | కుమార సంభవము (నన్నెచోడుడు) |
| 116 | కృ. క. | కృష్ణకర్ణామృతము. |
| 117 | కృష్ణాభ్యు | కృష్ణాభ్యుదయము. |
| 118 | కృ. శకుం | కృష్ణశకుంతలా పరిణయము. |
| 119 | కృ. వి. | కృష్ణరాయవిజయము. |
| 120 | కృ. శ. | కృష్ణశతకము. |
| 121 | కే. బా. | కేయూరబాహు చరిత్రము. |
| 122 | క్రీడా | క్రీడాభిరామము. |
| 123 | గం. వ. | గంధవహము. |
| 124 | గాధే. | గాధేయోపాఖ్యానము. |
| 125 | గో. రా | గోపినాధ రామాయణము. |
| 126 | ఘ. మ | ఘటికాచలమహాత్మ్యము |
| 127 | చం.హా. | చంద్రహాస |
| 128 | చం. భా. | చంద్రభానుచరిత్రము. |
| 129 | చం. రే | చంద్రరేఖావిలాసము. |
| 130 | చం. చ | చంద్రాంగదచరిత్రము. |
| 131 | చం. ప. | చంద్రికాపరిణయము. |
| 132 | చం. రా. | చంపూరామాయణము. |
| 133 | చమ. | చమత్కారమంజరి |
| 134 | చి. భా. | చిత్రభారతము. |
| 135 | చె. పు. | చెన్నబసవపురాణము |
| 136 | జా. మా | జాహ్నవీమాహాత్మ్యము. |
| 137 | జై. భా. | జైమిని భారతము. |
| 138 | తపతీ | తపతీ సంవరణోపాఖ్యా |
| 139 | ద.రా.చ | దశరథరాజనందన |
| 140 | ద. కు | దశకుమార చరిత్రము. |
| 141 | ద. చ. | దశావతారచరిత్రము |
| 142 | దా. శ | దాశరథీ శతకము |
| 143 | ది. చ. | దిలీపచరిత్రము. |
| 144 | ద్వా. క | ద్వాత్రింశిక (కథలు) |
| 145 | ద్వి.భాగ. | ద్విపదభాగవతము |
| 146 | ద్వి. సా. | ద్విపదసారంగధర |
| 147 | ద్వి. నల | ద్విపదనల చరిత్ర |
| 148 | ద్వి. పర | ద్విపదపరమయోగి విలా |
| 149 | ద్వి.భా | ద్విపదభాగవతము |
| 150 | ద్వి.భార. | ద్విపదభారతము. |
| 151 | ద్వి.హరిశ్చ | ద్విపదహరిశ్చంద్ర |
| 152 | ధనాభి | ధనాభిరామము |
| 153 | ధర్మ | ధర్మఖండము. |
| 154 | ధాతు | ధాతుమాల (ఆంధ్రము) |
| 155 | నరస | నరసభూపాలీయము. |
| 156 | న. నాధ | నవనాధచరిత్రము. |
| 157 | నలచ | నల చరిత్రము. |
| 158 | నా. సం. | నారాయణకవి పంచతంత్రము |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 159 | నార. పు | నారసింహపురాణము. |
| 160 | నిరం | నిరంకుశోపాఖ్యానము |
| 161 | నిర్వ. రా. | నిర్వచనోత్తరరామాయణము. |
| 162 | నీతి. శ | నీతిశతకము (సీసము) |
| 163 | నీ. సుం. | నీలాసుందరీ పరిణయము |
| 164 | నృ. పు | నృసింహ పురాణము |
| 165 | నైష | శృంగారనైషధము |
| 166 | పండి. | పండితారాధ్యచరిత్రము. (ద్వి.) |
| 167 | పద్మ | పద్మపురాణము(ఉ.ఖం) |
| 168 | పరమ | పరమయోగి విలాసము. |
| 169 | పా. హ. | పారిజాతాపహరణము. |
| 170 | పాం. ప | పాంచాలీ పరిణయము. |
| 171 | పాం. మ | పాండురంగ మాహాత్మ్యము. |
| 172 | పార్వ. | పార్వతీ పరిణయము. |
| 173 | పు. చ. | పురూరవశ్చరిత్రము. |
| 174 | ప్ర. ప్ర. | ప్రభావతీ ప్రద్యుమ్నము |
| 175 | ప్ర. లీ. | ప్రభులింగలీల |
| 176 | ప్ర.లీ. ద్వి | ,, (ద్విపద) |
| 177 | ప్ర. వెం | ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసము. |
| 178 | ప్ర. బో | ప్రబోధచంద్రోదయము. |
| 179 | ప్రభా. | ప్రభావతీ ప్రద్యుమ్నము |
| 180 | ప్ర. భూ. | ప్రబంధమణి భూషణము |
| 181 | బస. ద్వి. | బసవపురాణము(ద్విపద) |
| 182 | బహు | బహులాశ్వచరిత్రము |
| 183 | బిల్హ. | బిల్హణీయము. |
| 184 | బ్ర. ఖం | బ్రహ్మోత్తరఖండము |
| 185 | భ. సు. | భర్తృహరి. (సుభాషిత రత్నావళి) |
| 186 | భ. ప. | భద్రాపరిణయము. |
| 187 | భల్లా. | భల్లాణచరిత్రము |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 188 | భాగ | భాగవతము. |
| 189 | భాగ. ద్వి. | భాగవతము (ద్విపద) |
| 190 | భాను | భానుమతీ పరిణయము |
| 191 | భార | భారతము |
| 192 | భాస్క. రా | భాస్కర రామాయణము |
| 193 | భా. శ | భాస్కరశతకము |
| 194 | భీ. పు. | భీమేశ్వరపురాణము |
| 195 | భే. క | భేషజకల్పము |
| 196 | భో. | భోజరాజీయము |
| 197 | భో. ప | భోజసుతాపరిణయము |
| 198 | మనుచ | మనుచరిత్రము (స్వారోచిషమనుసంభవము) |
| 199 | మల్ల. | మల్లభూపాలీయము. |
| 200 | మ. పు. | మల్లపురాణము. |
| 201 | మల్హ | మల్హణచరిత్ర. |
| 202 | మార్కం | మార్కండేయ పురాణము. |
| 203 | ముకుంద | ముకుందవిలాసము. |
| 204 | మృ. వి. | మృత్యుంజయవిలాసము. |
| 205 | మై. | మైరావణచరిత్రము. |
| 206 | మొ.రా | మొల్లరామాయణము. |
| 207 | యయా | యయాతిచరిత్రము. |
| 208 | రంగా. | రంగారాయచరిత్రము. |
| 209 | రం. రా. | రంగనాధ రామాయణము. (ద్వి) |
| 210 | రఘు | రఘువంశము. |
| 211 | రఘునా | రఘునాధాభ్యుదయము. |
| 212 | రత్న | రత్నపరీక్ష. |
| 213 | రస | రసమంజరి. |
| 214 | రసా | రసాభరణము. |
| 215 | రసిక | రసికజన మనోభిరామము. |
| 216 | రాఘ | రాఘవపాండవీయము. |
| 217 | రాజగో | రాజగోపాల విలాసము. |

| సంఖ్య | సంకేతములు | పేరు | సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|---|---|---|
| 218 | రాజశే | రాజశేఖరచరిత్రము. | 250 | వేణు. శ | వేణుగోపాలశతకము. |
| 219 | రాజవా | రాజవాహనవిజయము. | 251 | వేమన | వేమనశతకము. |
| 220 | రాజ. వి | రాజశేఖరవిలాసము. | 252 | వైజ | వైజయంతీ విలాసము. |
| 221 | రాధామా | రాధామాధవము. | 253 | శశాం | శశాంకవిజయము. |
| 222 | రాధికా | రాధికాసాంత్వనము. | 254 | శాస. ప. | శాసనపద్యములు. |
| 223 | రామరా | రామరాజీయము. | 255 | శి. ధ | శివధర్మోత్తరము. |
| 224 | రామలిం | రామలింగేశ్వర శతకము. | 256 | శి. ర. | శివరహస్యఖండము. |
| 225 | రామాభ్యు | రామాభ్యుదయము. | 257 | శి. రా. | శివరాత్రిమహాత్మ్యము. |
| 226 | రామా | రామాయణము. | 258 | శి. సా. | శివతత్త్వసారము. |
| 227 | రా. ద్వి | ,, (ద్విపద). | 259 | శి. యో. | శివయోగసారము. |
| 228 | రు. చ. | రుక్మాంగదచరిత్రము. | 260 | శుక. | శుకసప్తతి. |
| 229 | రుక్మి | రుక్మిణీపరిణయము. | 261 | శు. చ. | శుకచరిత్రము. |
| 230 | లక్ష. సం | లక్షణసార సంగ్రహం | 262 | శృం. ర. | శృంగారరసమంజరి. |
| 231 | ల. వి. | లక్ష్మీవిలాసము. | 263 | శృ. రసా | శృంగారరసాలవాలము |
| 232 | లక్ష్మీ. నృ | లక్ష్మీనృసింహావతారము | 264 | శేష | శేషధర్మము. |
| 233 | వన. వి. | వనమాలివిలాసము. | 265 | శ్రీరంగ | శ్రీరంగమాహాత్మ్యము. (భై) |
| 234 | వరా. పు. | వరాహపురాణము. | | | |
| 235 | వసు. | వసుచరిత్రము. | 266 | శ్రీరం.మా. | ,, (వరద) |
| 236 | వాసి. | వాసిష్ఠరామాయణము. | 267 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము. |
| 237 | వాల్మీ | వాల్మీకిచరిత్రము. | 268 | షో. | షోడశకుమార చరిత్రము |
| 238 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | 269 | సకలనీ. | సకలనీతి సమ్మతము |
| 239 | విజ. వి. | విజయవిలాసము. | 270 | సత్యా. సాం | సత్యాభామాసాంత్వనము |
| 240 | విఘ్నే | విఘ్నేశ్వరీయము. | 271 | సమీర. | సమీరకుమారవిజయము |
| 241 | వి.నం. వి | విజయనందన విలాసము. | 272 | సర్వ. సా. | సర్వలక్షణ సారసంగ్రహము |
| 242 | విష్ణుపు | విష్ణుపురాణము. | | | |
| 243 | విష్ణుమా | విష్ణుమాయా నాటకము. | 273 | సస్యా. | సస్యానందము. |
| 244 | విప్ర. | విప్రనారాయణ చరిత్రము. | 274 | సాంబో | సాంబోపాఖ్యానము |
| | | | 275 | సానం | సానందోపాఖ్యానము |
| 245 | వీధినా | వీధినాటకము. | 276 | సారం. | సారంగధర చరిత్రము |
| 246 | వీర. వి | వీరభద్రవిజయము. | 277 | సా. ద్వి. | (ద్విపద) |
| 247 | వేం. పం | వేంకటకవి పంచతంత్ర | 278 | సిం. నా. | సింహాద్రినారసింహ శతకము. |
| 248 | వేం.మా | వేంకటాచల (కృ.కవి) | | | |
| 249 | వేం. మా. | వేంకటాచల మహాత్మ్యము. | 279 | సీతా. | సీతారామాంజనేయ సంవాదము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 280 | సీ. వి. | సీతావిజయము. |
| 281 | సీమం. | సీమంతినీకళ్యాణము. |
| 282 | సుద. | సుదక్షిణాపరిణయము. |
| 283 | సురా. | సురాభాండేశ్వరము. |
| 284 | సు. శ. | సుమతీశతకము. |
| 285 | సే. ఖం | సేతుఖండము. |
| 286 | హంస | హంసవింశతి. |
| 287 | హరిశ్చ. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము. |
| 288 | హర. | హరవిలాసము. |
| 289 | హ. వి. | హరభక్తవిలాసము. |
| 290 | హరి. | హరివంశము. |
| 291 | హ. ద్వి. | హర్చింద్రోపాఖ్యానము (ద్విపద). |
| 292 | హరి. వరా. | హరిభట్టువరాహపురాణము. |
| | | సంస్కృతలక్ష్యగ్రంథములు. |
| 293 | అమర. | అమరసుధ. |
| 294 | ఉత్త. | ఉత్తరరామచరితము. |
| 295 | కాదం | కాదంబరీకావ్యము. |
| 296 | కావ్యా | కావ్యాదర్శము. |
| 297 | గీత | భగవద్గీత. |
| 298 | గీ. గో. | గీతగోవిందము. |
| 299 | పరా. | పరాశరస్మృతి. |
| 300 | భట్టి. | భట్టికావ్యము. |
| 301 | భామిని. | భామినీవిలాసము. |
| 302 | మనుస్మృ. | మనుస్మృతి. |
| 303 | మ. వీర | మహావీరచరిత్రము. |
| 304 | మాలతీ | మాలతీమాధవము. |
| 305 | మాళ | మాళవికాగ్నిమిత్రము. |
| 306 | ముద్రా | ముద్రారాక్షసము. |
| 307 | మురా | అనర్ఘరాఘవము. (మురారాది) |
| 308 | మృచ్ఛ | మృచ్ఛకటికము. |
| 309 | మే. దూ | మేఘదూతము. |
| 310 | యాజ్ఞ | యాజ్ఞవల్క్యస్మృతి. |
| 311 | రత్నా | రత్నావళి. |
| 312 | రసగం | రసగంగాధరము. |
| 313 | విక్ర | విక్రమోర్వశీయము. |
| 314 | వేణీ | వేణీసంహారము. |
| 315 | శాకుం | అభిజ్ఞానశాకుంతలము. |
| 316 | శిశు. వ | శిశుపాలవధము. |
| 317 | సం. కిరా. | కిరాతార్జునీయము. |
| 318 | సం. కు. సం | కుమారసంభవము. |
| 319 | సం. చంరా | చంపూరామాయణము. |
| 320 | సం. దశ. | దశకుమారచరితము. |
| 321 | సం. నైష. | నైషధీయచరితము |
| 322 | సం. పం. | పంచతంత్రము. |
| 323 | సం. ప్ర | ప్రబోధచంద్రోదయము |
| 324 | సం. భర్తృ | భర్తృహరిసుభాషితము. |
| 325 | సం. భాగ | భాగవతము. |
| 326 | సం. భార | భారతము. |
| 327 | సం. రఘు | రఘువంశము. |
| 328 | సం. రామా | రామాయణము. |
| 329 | సం. సా. ద | సాహిత్యదర్పణము. |
| 330 | హి. దే | హితోపదేశము. |
| | | (మిగతవిస్పష్టము.) |

శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

అనుసీయకారాది

ఆంధ్ర ప్రతిపదార్థపర్యాయపద నిఘంటువు.

## శ్రీ శ్యామల కామశాస్త్రీయము



"శ్లో. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥"



### అ

అ. సం. వి. అ. పు.1. = (తద్భవము) అ. అచ్చులలోని మొదటి యక్కరము, అకారము: చూ, వర్ణము 1; 2. విష్ణుండు: చూ, విష్ణువు.1; 3. నలువ: చూ, బ్రహ్మ.1; 4. ముక్కంటి: చూ, శివుఁడు; 5. గాలి: చూ, వాయువు.1; 6. జుట్టు: చూ, శిఖ.౬; 7. గాయత్రిలోని[illegible]: చూ, మంత్రము.1-౧౧; 8. బలవంతము: చూ, హఠము; 9, గుఱ్ఱము: చూ, హయము.1; 10. బండికీలాడఁకొనిపోవు గుండ్రని చట్రము: చూ, చక్రము. 10: 11. కోడిపిల: చూ, శిరము. 1-౮; 12, చంద్రబింబము: చూ, బింబము. 8: 13. సురుఁడు, వేల్పుటొజ్జ: చూ, సురాచార్యుఁడు; 14: చూ, తాంబేలు .1; న.15. గౌరవము: చూ, సన్మానము; 16. కారణము: చూ, హేతువు.1: 17. నగ: చూ, భూషణము.2; 18. కాలుచాఁచి పెట్టినయడుగు: చూ, హజ్జ: 19. కూడుకొనిన శబ్దార్థములయొక్క భావకర్మములు: చూ, సాహిత్యము.1: స్త్రీ. 20. గౌరి: చూ, పార్వతి.1: అవ్య. 21. అభావార్థకము, ఏమియులేమి: చూ, శూన్యము.1: 22. నఞర్థకము: చూ, శూన్యము, 1. (లేమ); 23. నిషేధార్థకము: చూ, వలము.3; 24. కొంచెము: చూ, స్వల్పము,1; 25. అంగీకారము: చూ, సమ్మతి. 1; 26. పుట్టుక: చూ, సంభవము; 27. జగడము: చూ, యుద్ధము.1: 28. నలుచదరపుచోటు: చూ, ముంగిలి.2: 29, వాం

ప్రార్థకము: చూ, వాంఛ.1; 30. అంతః పురార్థకము: చూ, సదనము. 1-గ; 31. అవధారణార్థకము: చూ,సత్యము. 1-అ; 32. ఊంకొట్టుట:చూ,హుంకారము.2; 33. భిన్నార్థకము; 34. అప్రశస్తమంచు వర్తించునది; 35. విరుద్ధమంచు వర్తించునది; 36. సమాసమున వచ్చెడి "నఞ్" యొక్క లుప్త శేషము, ఇది అజాదిపదములు పరమగునపుడు "అన్"అగును. ఉదా."అనారోగ్యము"

వై. (తేద్భ) (1)=(తత్సమము)అ.అచ్చులలో మొదటియక్కరము:చూ,అ.1;(2) మఱియొకదాని లేమిని తెలుపును:చూ. లేమి; (3) తనంతట అనునర్థమును తెలుపును:ఎ,ఏ; (4) బొత్తిగా అనునర్థమును తెలుపును; (5) అలస్యములేమిని తెలుపును; (6) క్రియలకు ప్రార్థనార్థకమంచు వికల్పముగనను ప్రయుక్తమగును; (7) ఇది స్వరభేదముచేత ప్రశ్నించినవిషయముయొక్క వ్యతిరేక నిశ్చయమును తెలుపును: చూ,సవాలు; (8) సందియము:చూ,సంశయము.1; (9)నిజము:చూ,సత్యము.1; (10)ఒకానొకప్పుడు వాక్యాలంకారమును తెలుపును; సర్వ. (11)సమాసపూర్వపదముగా నున్న తచ్ఛబ్దార్థమును తెలుపును. "అ" అనుదానికి కొన్నిచోట్ల వచ్చెడియాదేశము; (12) ఉద్దేశార్థకమను నువర్ణకము పరమగునపుడు క్రియల తుది ఉకారమునకు ఆదేశముగా వచ్చును; గ.ఉద్దేశార్థకము.భార. ఆది.5.8;ఎ. భావార్థకము.భార.అర.1. 217; 3.అనంతర్యార్థకము.భార.శాంతి.5 347:ర. హేత్వర్థము.భార.ఆది.3.12: ౫. శాపార్థకము. కవిక. 3-127, (ఇట్లే మఱికొన్ని పట్లనాదేశముగావచ్చును.); (13)వ్యతిరేకార్థక ప్రత్యయము పరమగునపుడు ధాతువు తుది ఉకారమునకు ఆదేశముగా వచ్చునది. ఉదా:—చేయఁడు,చేయక,చేయడు.మొ; (14) యుష్మదస్మద్విశేషణంబుల తుది ఉకారమునకు క్రమముగ "వ-రు-ను-ము"వర్ణంబులు పరమగునప్డు వచ్చెడియాదేశము; (15)సంబోధన ప్రథమావిభక్త్యేక వచన ప్రత్యయమంద ఉకారమున కాదేశముగా వచ్చును; (16)షష్ఠీవిభక్తికంబగు "టి"వర్ణము పరమగునపుడు కొన్ని పదంబుల ఉకారమున కాదేశము గావచ్చును. ఉదా:-క్రిందటికి మొ,

అమ్. సం.వి, అ.న. 1. కారణము: చూ, అ.16; 2. నగ:చూ,అ.17; 3. కొలచాఁచిపెట్టిన యడుగు: చూ, అ.18; 4. పొడవు:చూ సోగ.2; 5. దోయిలి: చూ, కోసిలి; 6. అజ్ఞ:చూ, సెలవు; 7. సప్తస్వరముల కాలప్రమాణము:చూ, స్వరము. 2-గ-ఎ; 8. జగడము:చూ, అ.27; 9. నలుచదరపుచోట: చూ, అ.28; 10. అంతఃపురము:చూ, అ.30; 11. గౌరవము: చూ,అ.15.

అంక. దే.వి.(వైకృతమనికొందఱు)1. వైపు "మిన్నంక"భా.ఉ.అ: చూ,పార్శ్వము. 2; 2. మెడమీఁదనున్న కాఁడి మొదల

మాంసవిశేషము. (సూ. ని.); 2. పెద్ద యుసిరిక పండు ప్రమాణము కలిగి కోలగానుండి పశువు యొక్క పార్శ్వమున నుండు శ్లేష్మమందు ప్రసిద్ధమైన వృక్కయను మాంసము: చూ, వృక్క. 1; 3. కారిజము పొందు వ్యాధి: చూ, రోగము. 1-౩౬.

అగ్రిము. సం. వి. అ. న. 1. చివర:చూ, సుద. 3; 2. ఎదురు: చూ, ముందర.1; 3. దగ్గఱ: చూ,సమీపము.1; 4.గుంపు: చూ, సమూహము; 5. మానవిశేషము, నాలుగుకళ్ల కొండెభిక్ష, నాలుగు కబళముల భిక్ష; 6. పైభాగము: చూ, మీఁదు. 2; 7. పలమనెడి పరిమాణము: చూ, పలము. 1; 7. పెచ్చు, పైచిల్లర: చూ, హేరాళము. 1-౬; 9. ఆశ్రయము: చూ, సన్నిధానము "ఏకాగ్రచిత్తుఁడు" (సూ. ని.); విణ. 10. ప్రథమము: చూ, మొదలు. 4; 11. ప్రధానము: చూ, శ్రేష్ఠ్యము; 12. అధికము: చూ, హేరాళము. 1-౬; అం. 13: చూ, హస్తక్షేత్రములు.

అగ్రియానము. సం. వి. అ. న. 1.ముందు నడచునది.

అగ్రయాయి. సం. విణ. న్. నీ.న్.1:చూ, అగ్రగామి;2:చూ, శ్రేష్ఠుడు.2;3:చూ, మొదటివాఁడు. 3.

అగ్రయోధి. సం. వి. న్. పు. 1. వీరులలో ముఖ్యుఁడు: చూ,హంవీరుఁడు.2; 2. శూరులకెల్ల శూరుఁడు, గండరగండఁడు: చూ, హంవీరుఁడు. 2-౨.

అగ్రలోహిత. సం. వి. ఆ. స్త్రీ. చిత్రికూర*: చూ, భండీరము. 2.

అగ్రసంధాని. సం. వి. ఈ. స్త్రీ. ప్రాణివర్ణముయొక్క పూర్వకర్మాను సారము నగలుగు శుభాశుభములను తెలుపునట్టి యముని కవిలె (పొత్తము) (సూ. ని.): చూ, యమపట్టిక.

అగ్రసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. తొలిసంజ: చూ, ప్రాతస్సంధ్య. 2.

అగ్రసరి. సం.వి.ఈ:చూ, అగ్రయాయి.1, 2.

అగ్రసరుఁడు. —పై.—

అగ్రస్థానము. వా. వి. 1. మొదటిస్థానము: చూ,స్థానము.1-౪౧;2.సభలయందగ్రి స్థానము, మొట్టమొదటిస్థానము: చూ,స్థానము.1-౪౨;3.సంస్థలయందగ్రస్థానము: చూ, స్థానము. 1-౪౩.

అగ్రహస్తము. సం. వి. అ. పు: చూ, అగ్రపాణి. 1-2.

అగ్రహాయణము. సం. వి. అ. పు. రూ-అగ్రహాయణికము. మార్గశీర్ష మాసము: చూ, మాసములు. ౯.

అగ్రహాయణేష్టి. అం. రూ-ఆగ్రహాయణేష్టి - ఆగ్రయణము, నవసస్యేష్టి: చూ, హవిర్యజ్ఞములు.

అగ్రహారము. సం. వి. అ. పు. 1.బ్రాహ్మణుల యిండ్లవరుస, నల్లిండ్లు: చూ, దేశములు. 1-(౬)-3; అం. 2:చూ, సంతానములు; 3: చూ, దానములు; 4: చూ, మహాదానములు; పు. 5. పోషణమునకై రాజుబ్రాహ్మణుల

కిచ్చెడి గ్రామము లేక వసతిగల పుడమి.

అగ్రాంశువు. సం. వి. ఉ. పు. కిరణములు కూడుస్థలము.

అగ్రాక్షి. సం. వి. ఇ. న. క్రీఁగన్ను: చూ, లోచనము. 1-౧.

అగ్రానీకము. సం. వి. అ. న. ముందఱ గలసేన: చూ, సేన. 1-౮.

అగ్రామ్యము. సం. విశే. 1. గ్రామ్యము కానిది, నగరమందలిది; 2. అపభ్రంశము కానిది, శాస్త్రసమ్మతము (పదము మొ॥); 3. వన్యము (మృగాది). (సూ. ని.) [సమర్థుఁడు. 1.

అగ్రామ్యుఁడు. సం. విశే. నేర్పరి: చూ,

అగ్రాహ్యము. స . విశే. 1. గ్రహింపఁదగనిది, పుచ్చుకొనఁదగనిది; 2. తెలిసికొనఁదగనిది; 3. అంగీకరింపఁదగనిది; 4. నమ్మఁదగనిది; 5. పరిగణింపఁదగనిది, లెక్క సేయఁ దగనిది.

అగ్రిమ. సం. వి. ఆ. స్త్రీ. అప్ప: చూ, సహోదరి. 1-౨.

అగ్రిమము. సం. విశే. ముఖ్యము: చూ, శ్రేష్ఠ్యము.

అగ్రిముఁడు. సం. వి. అ. పు. 1 అన్న: చూ, సహోదరుఁడు. 1; విశే. 2: చూ, మొదటివాఁడు. 3; 3: చూ, శ్రేష్ఠుఁడు; 2; 4. పెద్దవాఁడు: చూ, స్థవిరుఁడు.

అగ్రియము. సం. విశే. రూ-అగ్రీయము. ముఖ్యమైనది: చూ, శ్రేష్ఠ్యము.

అగ్రియుఁడు. సం. రూ- అగ్రీయుఁడు: చూ, అగ్రిముఁడు. 1, 2, 3, 4.

అగ్రీయము. సం. విశే. 1: చూ, రూ. అగ్రియము; 2. ప్రధానమైన వస్తువు; చూ, రూ-అగ్ర్యము.

అగ్రీయుఁడు. సం: చూ, రూ. అగ్రియుఁడు.

అగ్రేదిధిషువు. సం. వి. ఉ. పు. 1. బిడ్డలుగన్న మాఱుమనువుదాని మొదటి బ్రాహ్మణ స్త్రీయొక్క భర్త: చూ, సామి. 1-౨; 2. మాఱుమనువు దాని మొదటి మగఁడు: చూ, సామి. 1-3; స్త్రీ. 3. అక్కకు ముందు పెండ్లాడిన చెల్లెలు (సూ. ని.).

అగ్రేసరుఁడు. సం. విశే: చూ, అగ్రతస్సరుఁడు.

అగ్ర్యము. సం. విశే: చూ, రూ- అగ్రీయము.

అగ్ర్యుఁడు. సం. విశే: చూ, అగ్రతస్సరుఁడు.

అగ్న్యుత్పాతము. సం. వి. అ. న. ఆకాశాదులయందుఁ బుట్టిన అగ్నివికారము, తోఁకచుక్క: చూ, రి క్క-1-(౨)-౨.

అఘటమానము. సం. విశే. ఘటిల్లనిది. భార. అర. ౧-౩౩౧.

అఘటనము. సం. వి. అ. న. దధివిశేషము: చూ, స్తన్యము. 1-౨౩-౧.

అఘభోజి. సం. విశే. దేవపితృ౽తిథులకు పెట్టక తాను తినువాఁడు. (సూ. ని.)

అఘమర్షణము. సం. వి. అ. న. సర్వపాపములను పోఁగొట్టెడి మంత్రము. ("అఘమర్షణస్నానము" ఇది ఋగ్వేదమున ౧౯౦ వ సూక్తము. జలములయందు మూఁడుమాఱులు దీనిని జపింపఁగా గురుతల్పగమనాది మహా పాతకములు గూడ నశించును.): చూ, మంత్రము. 1.

అఘము, సం. వి. అ. న. 1. పాపము: చూ, వృజనము; 2. దుఃఖము: చూ, శోకము.2; 3. ఆశౌచము:చూ,మయిల. 4; 4. ద్యూతాదివ్యసనము: చూ, వ్యవహారము. 1-౨౨.

అఘశంసి. సం. విశ. ఇతరుల దోషములను ప్రకటించువాఁడు.

అఘాటము. సం. వి. అ. పు. 1=అగడిత-అగడ్త: చూ, స్వర్ణది; విశ. 2: చూ, నిరాఘాటము.

అఘాతము. సం. వి. అ. పు. 1: చూ, రూ-అఖాతము. 1; 2: చూ, అఖాతము. 2; 3. కొండపగులు: చూ, పర్వతము. 1-౧౨; 4. కొండనడుము:చూ, పర్వతము. 1-౧౧.

అఘాయువు. సం. వి. ఉ. పు.1. పాము: చూ, సర్పము. 1; 2. పాపాలమూఁద్ద: చూ, వ్యాధుఁడు. 2; 3. కాకి: చూ, వాయసము. 1; 4. చామరము: చూ,సుకఁటి. 1-౧ 5.కత్తి: చూ,కిష్టి.2; విశ. 6: చూ, అఘాయువు. 2.

అఘాహము. సం. వి. అ. పు. ఆశౌచదినము: చూ, రోజు. 1-౨.

అఘుఁడు. సం. వి. అ. పు. 1. అఘుఁడనెడు రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2: చూ, అఘాయువు. 2; 3: చూ, మైలవాఁడు: 4. దుఃఖాన్వితుఁడు: చూ, విమనుఁడు.

అఘృణి. సం. విశ: చూ, కాంతిహీనుఁడు.

అఘో. సం. అవ్య. దుష్టునిఁ బిలుచుటను దెలుపును: చూ, సంబోధనము.

అఘోర. అం: చూ, శివాననములు. (చూ. అఘోరము.)

అఘోరపరిమాణము. సం. వి. అ. న. పెద్ద ఒట్టు: చూ, శపథము. 1-౧.

అఘోరము. సం. వి. అ. న. 1. ఈశ్వరుని దక్షిణముఖము: చూ, శివుఁడు (చూ, అఘోర); 2 నక్క: చూ, సృగాలము; విశ. 3. భయములేనిది: చూ, నిర్భయము; 4. చేనికంటె ఘోరములేదో అది, అతిభయంకరము, గోరగింత: చూ, రౌరవము. 2-౩.

అఘోరుఁడు, సం. వి. అ. పు. 1. రుద్రుఁడు: చూ, శివుఁడు. 1; 2. రుద్రుని దుగ్గను అర్చించువాఁడు: చూ, శివుఁడు 1-౩; విశ. 3. అఘోరసాంప్రదాయమునకుఁ జెందినవాఁడు; 4. అసహ్యముగ నుండు వ్యక్తి; 5. అసహ్యకరమగు వస్తువుల నుపయోగించువాఁడు; 6. భక్ష్యాభక్ష్య విచారణ లేనివాఁడు.

అఘోషము. సం. వి. అ. పు. 1. (వ్యాక) వర్ణోత్పత్తికైన బాహ్యప్రయత్న భేదము. ఆప్రయత్నముతోఁ గూడిన వర్ణము. (క-ఖ-చ-ఛ. మొ॥); విశ. 2. ధ్వని లేనిది: చూ, స్వరము. 1-(౧౫౦).

అఘ్న. సం. వి. ఆ. స్త్రీ. (చంపఁదగనిది) 1. ఆవు: చూ, ధేనువు. 1; 2. ఓడ: చూ, హోడము.

అఘ్న్య. సం. వి. అ. స్త్రీ: చూ, అఘ్న. 1.

అఘ్న్య. —పై.—

అఘ్న్యఁడు. సం. వి. అ. పు. (చంపనివాఁడు) , నలువ: చూ, బ్రహ్మ. 1.

అఘ్రేయము. సం. వి. అ. న. 1. కల్లు: చూ, సుర. 2; విశే. 2. అఘ్రాణింపఁదగనిది; అఘ్రాణింప శక్యముకానిది.

అచండి. సం. వి. అ. స్త్రీ. 1. సాధువైన యావు: చూ, ధేనువు. 1-౨౯; 2. కోపములేని యాఁడుది: చూ, స్త్రీ. 1-౧౧౪.

అచతురము. సం. విశే. 1. నాలుగులేనిది; 2. నేర్పరికానిది.

అచతురుఁడు. సం. విశే. చతురతలేనివాఁడు: చూ, అసమర్థుఁడు.

అచపలుఁడు. సం. విశే: చూ, స్థిరుఁడు.

అచరము. సం. విశే. కదలనిది: చూ, స్థిరము. 4.

అచల. సం. వి. అ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1.

అచలకీల.—పై.—

అచలచలన్యాయము. న్యా. ఓడ మొll ఎక్కిపోవునపుడు కదలకుండునట్టితీరాదులు నడచుచున్నట్టును, నడచు చున్న యోడనిలిచినట్టును గనఁబడురీతి.

అచలజ. సం. వి. అ. స్త్రీ. పర్వతపుత్రి: చూ, పార్వతి.

అచలజిహ్వ. అం:చూ,శబ్దాలంకారములు.

అచలతారలు. వా.వి. బ. స్థిరనక్షత్రములు: చూ, రిక్క. 1-(౨)-౧౩.

అచలత్విట్టు. సం. వి. ష. పు. 1: చూ, సాదుదుపులుఁగు; స్త్రీ. 2. స్థిరమైన కాంతి: చూ, వెలుతురు. 1-౧౯; విశే. ష. 3. స్థిరమైన కాంతిగలది: చూ, వెలుతురు 1-౨౦.

అచలము. సం. వి. అ. పు. 1. కొండ: చూ, పర్వతము. 1; 2. మేకు: చూ, శూలము. 4; సర్వ. 3. ఏడు అను అంకె: చూ,సప్తకము.1;న.4.బ్రహ్మము: చూ, హంసుఁడు. 2; విశే. 5. చలింపనిది: చూ, స్థిరము; అం. 6: చూ, విమ్యుత్తులు.

అచలుఁడు. సం. వి. అ. పు. 1. స్థాణువు: చూ, శివుఁడు. 1; 2. ఆత్మ: చూ, హంసుఁడు; విశే. 3: చూ, స్థిరుఁడు.

అచాంచల్యము. అం: చూ, మానసిక పూజాకుసుమములు.

అచాతుర్యము. సం. వి. అ. న. సామర్థ్యము లేకయుండుట: చూ, అశక్తత, అశక్తి, అసామర్థ్యము.

అచాపలము. సం. వి. అ. న. 1. స్థిరత్వము: చూ, స్థైర్యము. 1; విశే. 2. చాపల్యములేనిది: చూ, స్థిరము.

అచాపల్యము. సం. వి. అ. న. చాపల్యము లేకయుండుట:చూ, స్థైర్యము. 1.

అచింతము. సం. వి. అ. న. మరణము: చూ, సావు.

అచింతనీయము. సం. విశే: చూ, అచింత్యము.

అచింతితము. సం. విశే. 1. చింతింపఁదగనిది; 2. తలఁపఁబడనిది; 3. ధ్యానింపఁబడనిది.

అచింత్యము. సం. విశే. 1. చింతింపరానిది; అం.2: చూ, సంఖ్యాభేదములు.

అచిత్తి. సం. వి. ఇ. స్త్రీ. తెలివిలేమి: చూ, స్వాపము. 3.

అచిత్తు. సం. విణ. 1. ప్రాణము లేనిది: చూ, జడము. 5; 2. తనంతట తెలుఁగనిది.

అచిరద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

అచిరప్రభ. అ. స్త్రీ. —వై.—

అచిరము. సం. విణ: చూ, క్షణభంగురము.

అచిరాత్. సం. అవ్య. శీఘ్రము: చూ, స్యదము. 1.

అచీర్ణము. సం. విణ. ఆచరింపఁబడనిది: చూ, అకృతము.

అచుంబితము. సం. విణ. అనుభవింపఁబడనిది: చూ, అనుభుక్తము.

అచూర్ణము. సం. విణ. పొడిచేయఁబడనిది.

అచేతనత్వము. సం. వి. అ. పు. ప్రాణము లేమి: చూ, జడత్వము.

అచేతనము. సం. విణ: చూ, జడము. 5.

అచేతస్కము. —వై.—

అచేష్టుఁడు. సం. విణ. వ్యాపారరహితుఁడు: చూ, నిశ్చేష్టుఁడు.

అచైతన్యము. సం. వి. అ. పు: చూ, అచేతనము.

అచోదితము. సం. విణ. ప్రేరేపింపఁబడనిది.

అచౌర్యము. సం. విణ. దొంగతనము కానిది.

అచ్చు. సం. వి. చ్. పు. 1. ప్రాణాక్షరము, అకారాదికము: చూ, వర్ణము. 1; 2. నాదము: చూ, స్వరము. 2; (అనికొందఱు)

అచ్యుతాగ్రజుఁడు. సం. వి. అ. పు: చూ, బలరాముఁడు.

అచ్యుతుఁడు. సం. వి. అ. పు. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. సని: చూ, శని; 3. ముక్కంటి: చూ, శివుఁడు. 1.

అచట. దే. క్రి. రూ- అచ్చట- అచ్చోటు- అచోటు- అచ్చోటు- అచ్చోటు- అచ్చో- అటు - అక్కడ, అస్థలము. భార. ఉద్యో. ౪-౩౨౮; భార. అను. ౪-౪౩౮; భార. శాం. ౩-౯౨; విక్ర. ౨-౪౫; పారి. ౧-౭౮: చూ, తత్తి.

అచటు. దే. వి. ఏ. రూ- అచ్చటు- అచోటు, అస్థానము: చూ, రూ- అచోటు.

అచాటము. దే. విణ. విరివియైనది: చూ, సుర. 3. [భార. స్వ. ౧౯.

అచౌటు. దే. వి. ఏ: చూ, రూ- అచటు.

అచోటు. దే. వి. ఏ. క్రి. —వై.—

అచ్చకారము. వై. వి. = అచ్చంకార. రూ- అచ్చాకారము- అచ్చారము, బయానా, క్రయవిక్రయముల గట్టిమాట: చూ, సత్యంకారము.

అచ్చకక్కబుచ్చకక్కలు. వా. వి. విణ. బ: చూ, రూ- అచ్చికబుచ్చికలు.

అచ్చట. దే. క్రి. అక్కడ: చూ, తత్తి.

అచ్చటచ్చట. దే. క్రి: చూ, అక్కడక్కడ.

అచ్చటు. దే. వి. ఏ: చూ, రూ- అచటు. భార. అను. ౨-౫౬; భార. అను. ౪-౭౩; అము. ౧-౧౦; పారి. ౪-౫౫.

అచ్చతబొట్టు. వై. వి. అక్షతలతోఁబెట్టుకొను బొట్టు. పి. శ. ౪. ౩౮: చూ, బొట్టు. 1-౧౪.

అచ్చతెనుఁగు. వై. వి. శుద్ధాంధ్రభాష, స్వచ్ఛమగు తెనుఁగు. "అచ్చతెనుంగుఁ బద్దెమొకటైనను గబ్బములోన నుండిన౯." యయా; "తత్సమేతరభాషేయ మచ్ఛేతికవయోవదన్" ఇత్యాది.

అచ్చనగండ్లు. దే. వి. బ. రూ-అచ్చనగుండ్లు. బాలికాక్రీడావిశేషము. పాంచా. ౧. ౫౭: చూ, బాలక్రీడ; 2. గిరియకములు. అచ్చనగుండ్లాడెడు చిన్న చిన్న గుండ్లు (బ. అచ్చనగల్లు). కళా. ౬-౨౯: చూ, రత్నములు 1- ౧౨-(౨).

అచ్చనగాయలు. దే. వి. బ: చూ, అచ్చనగండ్లు. (బాలికాక్రీడాసు..పక్కి ౧౭౯.)

అచ్చనగుండ్లు. —వై.— (గిరియకములు.—..రామా. ౫-౧౨౧)

అచ్చనలు. వై.వి. బ.=అచ్ఛ. (వృత్తియందే కవచనాంత మగును.) 1: చూ, అచ్చనగండ్లు; 2: చూ, అచ్చన గండ్లు. 2; 3. నృత్యము. పండితా. ౧౬౨ పొ; జై. భా. ౧. ౫౫: చూ, వ్యంజకము. 1-౧౭.

అచ్చబంగారు. ద్వ. వి. 1. మేలిమివన్నె బంగారు: చూ, లోహము. 1-౫-(౧); 2. ముద్దుపలుకు: చూ, శబ్దము. 1-౭౫.

అచ్చము. వై. విశ.=అచ్ఛమ్. (దీనికివృత్తియందంత్య వర్ణలోపము వికల్పముగ నగును.) 1. నిశ్చలమయినది: చూ, సత్యము. 1; 2. తేరినది: చూ, సమీచీనము. 2; 3. నిర్ణయింపఁబడిన=: చూ, స్థాపితము. 2; 4. తెల్లనిది: చూ వర్ణము 6-౫-(౧); ౫. దట్టము: చూ, సాంద్రము. 1; వా. 6. ఇష్టానుసారము.

అచ్చముగ. వా. అవ్య. సంశయములేకుండఁగ, స్వేచ్ఛగ, ఇచ్చవచ్చినటుల.

అచ్చర. వై. వి.=అప్సరస్. దేవవేశ్య. మనుచ. ౨-౩౮: చూ, దేవతాభేదములు; (చూ, స్త్రీ. 1-౫౬.)

అచ్చరనది. మి. వి: చూ, అచ్చరవాఁక.

అచ్చరము. వై. వి=అక్షరమ్. వైజ. ౨-౯౫: చూ, వర్ణము. 1.

అచ్చరవాఁక. వా. వి. ఆకాశగంగ: చూ, నది. 1.

అచ్చరువడు. వై. అ. క్రి: చూ, ఔఱఁగొను. కు. సం. ౧౦. ౪౮౬.

అచ్చరువు. వై. వి.ఆశ్చర్యమ్-రూ-అచ్చెరువు. కు. సం.౧౧.౭౬౮:చూ,వింత.1.

అచ్చలము. దే. వి. 1. కోపము: చూ, రోషము; 2. పట్టుదల. భార. సభా. ౨. ౧౭౦: చూ, సన్నాహము. 2.

అచ్చలించు. దే. అ. క్రి: చూ, రోషించు.

అచ్చాకారము. వై. వి. = అచ్ఛంకారమ్: చూ, రూ-అచ్చకారము.

అచ్చాణి. వా. విశ. 1. ఆణిముత్తెములఁ బోలునది, శ్రేష్ఠవాచకము; 2. శ్రేష్ఠమైనది: చూ, శ్రేష్ఠ్యము. 1-౧.

అచ్చారము. వై. వి.=అచ్ఛంకారమ్: చూ, రూ-అచ్చకారము.

అచ్చావు. దే. వి. 1. తెల్లయావు: చూ, ధేనువు. 1-౧౨; 2. నైచికి, శ్రేష్ఠమైన యావు: చూ, ధేనువు. 1-౨౩.

అచ్చాళి(ళు). దే. విశ. (అచ్చము+ఆళు) జంజాటములేనివాఁడు "ద్వి. అయోధ

బలయుక్తి నవ్వాళుగాగ" పతివ్రతా మాహాత్మ్యము (బ్రౌణ్యా. ని.).

అచ్చి. దే. వి. 1. అచ్చిపట్టమను దేశము: చూ, దేశములు. 1-౫౭; వా. 2. తుమ్ము యొక్కధ్వని. (వా. రూ-అచ్చీ. అనియు); 3. ఒకానొక స్త్రీవాచకము. (అచ్చమ్మ)

అచ్చిక. దే. వి. రూ-అచ్చికము. 1. కొఱత, లోపము. హంస. ౧-౮౯: చూ, కొలితి. 2; 2. క్షోభము. హరి. పూ. 3-౧౩౪: చూ, సంతాపము. 1.

అచ్చికబుచ్చిక. దే. వి. రూ-అచ్చిక బుచ్చికము. 1. ఇచ్చకము, బుజ్జగింపు. విజ. 3-30; వేం. పంచ. ౨-౬౮: చూ, సమరసము 2; బ. 2. బెల్లింపు మాట, ఇచ్చకపుమాట. ద్వి. హరిశ్చ. ఉ. ౬౩౬: చూ, శబ్దము. 1-౧౦; విశ. 3. చెవులకు విననింపయినది: చూ, సాంత్వము. 3.

అచ్చికబుచ్చికము. దే. వి, విశ. -పై.-

అచ్చికబుచ్చికలు. దే. వి, విశ. బ. -పై.-

అచ్చికబుచ్చికలాడు. దే. స. క్రి: చూ, బుజ్జగించు.

అచ్చికము. దే. వి. 1: చూ, రూ-అచ్చిక. 1; 2: చూ, రూ-అచ్చిక. 2; 3: చూ, అచ్చికబుచ్చిక. 1; విశ. 4. తేటినది: ఆం, భా. ౧-౧౫౮: చూ, సమీచీనము. 2-౧.

అచ్చికలుబుచ్చికలు. దే. వి. బ: చూ, రూ-అచ్చికబుచ్చికలు (కలువుకోలు తనమునకు-చంద్రా. 3-౪౫.)

అచ్చిమట్టము. దే. వి: చూ, అచ్చి. 1.

అచ్చియుండు. వా. స. క్రి. 1. ఇచ్చుకొనవలసియుండు; 2. చచ్చినను తను వాటిజన్మమున తీర్చవలసియుండు.

అచ్చివచ్చు. దే. అ. క్రి: చూ, మేలైవచ్చు.

అచ్చు. వై. వి. 1. బెల్లము: చూ, శర్కర. 1-౧; 2. నీవి. భార. స్త్రీ. ౧-౫౧; ఆం, భా. 3-30౨: చూ, వికారము. 1; 3. రీతి. భోజరా. ౭. ౧౫: చూ, విధము. 1; 4. సంజ్ఞాక్షరములుచెక్కిన ఉంగరములోనగునది. భాగ. ౧౦, ఉ. 330: చూ, ముద్ర. 2; 5. సాలెవాని నేతసాధన విశేషము: చూ, మగ్గము. 1-౧; 6. నాణ్యములు కాగితములులోనగు వానిపై అక్షరములు బొమ్మలు మొ॥ వానినిఒత్తుసాధనము (చూ, అచ్చు. 4.); 7. చెంబు మొ॥ పోతపోయుటకును, ఇటిక మొ॥ తీయుటకును కూర్చిన మొదటియాకృతి. భార. విరా. ౨-౫౨: చూ, పోతఅచ్చు; 8. మొదటిదృష్టాంతము, ఆదర్శము. కు. సం. ౭. ౮౬౭: చూ, వృత్తాంతము. 7; 9. గుఱుతు. కు. సం. ౪-3౬౭; జస. ౬-౫౯; పి. ళ. ౪. ౧౭౫: చూ, లక్షణము. 1; 10. ముద్రవేసిన తూనికరాయి మొ॥ విజ్ఞా. ప్రా. ౬౫: చూ, రత్నములు. 1-౧౨-(౬౦); 11. అచ్చునబోసి తీసినవస్తువు (చూ, అచ్చు. 7.); 12. పరిశుద్ధి: చూ, సమీచీనము. 2; 13. పాచిక. ద్వా. ౧౦-౮౮: చూ, వ్యవహారము. 4-౬; 14. ఇరుసు ప్రమాను; చూ, ఇరుసు. 1. (బ్రౌణ్యా.);

విణ. 15. దోషములేనిది. విజ్ఞా. ప్రా. ౯౧; శుక. ౪-౪౬: చూ, సమీచీనము. 2; 16. తెల్లము. హరి. పూ. ౬-౩౦: చూ, స్పష్టము; 17. సరియైనది, యథార్థము. ఉ. రా. ౨-౩౧౬ (అచ్చుగ=సరిగా). ఉ. రా. 3-౯౨: చూ, సత్యము. 1; 18. తగినది. భాగ. ౧౧-౧౩. (అచ్చుగ=ఒప్పుగా): చూ, యోగ్యము. 2; దే. అ. క్రి. 19: చూ, బాకీపడు. శేష. ౩-౨౨౧; ద్వి. హరిశ్చ. ఉ. ౬౨౦; 20: అచ్చుకొను, జామీనుండు, పూచిపడు-పూచీపడు, పూటపడు, హామీపడు. కాశీ. ౫-౧౨౫; స. క్రి. 21. ఇచ్చుకొను: చూ, దయచేయు. 2; 22. నష్టమిచ్చు. విజ్ఞా. ప్రా. కాం. ౪౦; విజ్ఞా. ప్రా. కాం. ౯౧; దశా. ౪. ౧౨౦౧; దశా. ౪. ౧౧౬౩: చూ, దండుగిచ్చు; 23. విధిగాఇచ్చుకొను: చూ, చెల్లించు.

అచ్చుకట్టు. ద్వ. స. క్రి. 1. ఏర్పఱచు. హరి. ఉ. ౯. ౧౫౦; పాండు. ౧-౧౧; నృసింహపీఠిక. ౧-౦: చూ, సృజించు;2 (పాలము) మడిమడిగాయేర్పఱచు. వైజ. ౧-౦౫; వా. 3. సాలెవానిపనికి సంబంధించినది.

అచ్చుకట్టువాఁడు. ద్వ. వి. 1. బట్టలనేతకుపయోగించు అచ్చులుకట్టు వాఁడు; వా. 2. ముద్రణాలయమున అక్షరములఁ గూర్చువాఁడు. (1900 సంllర ములలో నీవ్యాసస్పత్యకర్త తండ్రిగారి యాజ్ఞనుశిరసావహించి "లక్ష్మీనారాయణీయము" నకు లేఖరియై పూర్తిగా వ్రాసిన పిదప 1906 సంllలో స్వంతముద్రాక్షరశాలయందు అక్షరసంధానోద్యోగియై దానినిరోజునకు ఎనిమిది పారటల వంతున అచ్చు కూర్చుచు పూర్తిగావించెను.) [పన్నుఁడు.

అచ్చుకుప్ప. దే. వి. ధనికుఁడు: చూ, సం

అచ్చుకూటము. ద్వ. వి. ముద్రాశాల: చూ, సదనము. 1-౪.

అచ్చుకొట్టు. వా. స. క్రి: చూ, ముద్రించు. 1.

అచ్చుకొను. దే. అ. క్రి. 1: చూ, అచ్చు. 20;2.ఇచ్చుకొను: చూ, దయచేయు.2; వా. 3: చూ, సమ్మతించు.

అచ్చుగుద్దు. వా. స. క్రి: చూ, అచ్చుకొట్టు.

అచ్చుటెద్దు, ద్వ. వి. (అచ్చు+ఎద్దు) అచ్చుపోసి స్వేచ్ఛగాఁదిరుగ విడిచిన వృషభము, ఆఁబోతు: చూ,వృషభము.1.

అచ్చుదల, దే.వి.1.అప్పు.(అప్పునకుఒప్పి దల అనికొందఱు): చూ, వాకము. (1)-౧; 2. ఒప్పువల, కాశి. ౨-౧౨౦: చూ, సమ్మతి. 1; 3. అప్పు పడుట; 4. అచ్చి (సక్రమముగా) వచ్చుట: చూ, శుభాగమము.

అచ్చుపడు వై. అ. క్రి. 1. తెల్లముగు. భార. ద్రో. ౫-౩౧౫; హరి. ఉ. ౩-౧౫౯; భాగ. ౧౦. పూ. ౧౧౮౪: చూ, విశదమగు; 2. ముద్రితమగు; 3. అలవడు. కాశి. ౪-౧౩; విక్ర. ౬. ౯౦: చూ, సిద్ధించు; 4. ఉచితమగు. భార. విరా. ౫-౧౬౩: చూ,

సార్థకమగు; 5. ఏర్పడు: చూ, పాలు
పోవు. 2; 6. (కాల్చిన) రక్ష ఏర్పడు,
ముద్రాంకితమగు;7.(అబోతునకు) రక్ష
ఏర్పడు: అచ్చుపోయు.

**అచ్చుపడు(ఱు)చు.** ద్వి. స. క్రి. 1. నియ
మించు. భార. విరా. ర-౨ల: చూ,
సెలవిచ్చు; 2. కలిగించు. భార. అను,
౫-౨౩ర: చూ, సృజించు; 3. ఏర్ప
ఱచు. పద్మ. ౨-౬౯: చూ, నిర్దేశించు. 2.

**అచ్చుపాటు.** వై. వి. 1. ఏర్పాటు. భార.
శల్య. ౧-౧౧: చూ, సత్యము. 2;
2. అచ్చుపడుట: చూ, స్పష్టత.

**అచ్చుఁబొడిచినయాఁబోతులు.** జా. స్వేచ్ఛ
గా (హద్దులేక) తిరుగువాండ్రు. "రాజ
భటుల నచ్చుఁబొడిచిన యాఁబోతుల
రీతిని" (ధర్మజరాజసూయము.)

**అచ్చులు.** వై. వి.బ. 1: చూ, అచ్చు.1;
2: చూ, అచ్చు. 2; వా. బ. 3.పోత
పోయు అచ్చులదిమ్మలు.

**అచ్చువేయు.** వై.స. క్రి:చూ,అచ్చుకొట్టు.

**అచ్చుపోఁత.** వా. వి. కరిగిన లోహాదుల
పోఁత: చూ, పోఁత. 2.

**అచ్చుపోయు.**వా.అ.క్రి: చూ,అచ్చుపడు.6.

**అచ్చెరియము.** వై. వి=ఆశ్చర్యమ్. రూ-
అచ్చెరువు- అచ్చెరుపాటు - అచ్చెరున
పాటు. 1. ఆశ్చర్యము. కృ. శకుం. ౨-
౧౬౯: చూ, వింత 1; విణ. 2. ఆశ్చ
ర్యకరము: చూ, వింత. 1-౧.

**అచ్చెరుపడు.** వై. అ. క్రి. రూ-అచ్చెరు
వడు. నిర్వ. ౧౦. ౧౫౬; భార. ఉ.
౩-౧౧: చూ, వెఱఁగొందు.

**అచ్చెరువడు:**చూ, రూ-అచ్చెరుపడు.

**అచ్చెరుపాటు.** వై.వి. రూ-అచ్చెరువాటు-
అచ్చెరువుపాటు: చూ, వింత. 1.భార.
శాం. ౩-౪౪౬.

**అచ్చెరువాటు.** వై. వి.—వై.౨

**అచ్చెరువు.** వై. వి. రూ-అచ్చెర్వు.1:చూ,
రూ-అచ్చెరువు. ఉ. రా. ౪-౩-౨౯;
విణ. 2. ఆశ్చర్యకరము. భీమ. ౧-౭౨;
అహ. ౧-౧౦౨: చూ, వింత. 1-౧.

**అచ్చెర్వు** —వై.—

**అచ్చెరువుపడు.** వై. అ. క్రి: చూ, రూ.
అచ్చెరుపడు.

**అచ్చెరువుపాటు.** వై. వి:చూ,రూ-అచ్చెరు
పాటు. భార. భీష్మ.౨-౩౩.

**అచ్చోటు.** దే.వి. ఏ. (అ+చోటు)రూ-
అచ్చోటు. 1. ఆస్థానము. భార. ద్రో.
౨-౨౫౧; అమ. ౪-౧౪౫:చూ, రూ-
ఆచోటు; 2. అడుగుటి. హరి. ఉ.
౯-౪౨: చూ, భగము. 12.

**అచ్చొత్తు.** ద్వి. స. క్రి. (అచ్చు+ఒత్తు);
చూ, ముద్రించు. బస. పు. ౫-౩౧.
హరి. ఉ. ౭-౮౩.

**అచ్చో.** దే. క్రి. 1: చూ, రూ-అచట;
మను. ౩-౩; 2. ఆకాలమున. దశా.
౧-౩౧౧: చూ, రూ-అచ్చోటు. 3.

**అచ్చోటికి.** దే. అవ్య. 1: చూ, అందులకు;
వా. 2. రహస్యస్థలమునకు.

**అచ్చోటు.** దే. వి. ఏ. 1: చూ, రూ-
అచ్చోటు. 1. శుక. ౧-౧౦౬;2:చూ,
రూ-అచ్చోటు. 2; 3. ఆకాలమున:
చూ, రూ-అచ్చో. 2.

అచ్ఛంకారము. సం. వి. అ. న.= అచ్చకారము: చూ, అచ్చకారము.
అచ్ఛత. సం. వి. అ. న. అచ్చుపాటు: చూ, స్పష్టత. [సన్యాసి. 1.
అచ్ఛదనుఁడు. సం. వి. అ. పు. యతి: చూ,
అచ్ఛపిండ. సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరము*: చూ, మధుఖర్జూరిక. 1-౩.
అచ్ఛభల్లము. సం. వి. అ. పు. రూ-అచ్ఛభల్లము: చూ, ఎలుఁగుబంటి.
అచ్ఛభల్లము.—పై.—
అచ్ఛము. సం. వి. అ. పు. 1.—పై.—; 2. పటికపురాయి: చూ, రత్నములు. 1-౧౨-(౩); 3. వై. వి.=అచ్చన: చూ, బాలక్రీడ; విణ. 4. అచ్చు, తెల్లనిది: చూ, వర్ణము. ౬-(౧); 5. ఇంపితము: చూ, హృద్యము. 2; 6. అచ్చము: చూ, సమీచీనము. 2.
అచ్ఛాచ్ఛము. సం. విణ. మిక్కిలి స్వచ్ఛము: చూ, సమీచీనము. 2.
అచ్ఛావాకుఁడు. సం. వి. అ. పు. సోమయాగమందు శంసనకర్తయై హోతకు సహకారిగానుండు ఋత్విజుఁడు. పదియార్వురు ఋత్విజులు యాజికులు అనువారలలో నొకఁడు: చూ, ఋత్విజులు.
అచ్ఛిద్ర. సం. వి. ఆ. స్త్రీ. చేఁదుబీఱ*: చూ, హ్రస్వాగవేధుక:.
అచ్ఛిద్రము. సం. విణ. 1. రంధ్రములు లేనిది; 2. దృఢమైనది: చూ, ఔడిదము. 5; 3. యజుర్వేదమునందలి పరాయితములలో మూఁడవ అష్టమునందుఁగల ఒకపన్నము: చూ, వేదము. 1-౨౧;

4. లోపములేనిది: చూ, సంపూర్ణము; 5. ప్రాయశ్చిత్తము సంపూర్ణమైన దనుట.
అచ్ఛిన్నపత్రము. సం. వి. అ. పు. బరివెంక*: చూ, శాఖోటి.
అచ్ఛిన్నము. సం. విణ. 1. ఎడతెగనిది: చూ, సాంద్రము ౪; 2. ఛేదింపఁబడనిది: చూ, విచ్ఛిన్నము. 3-౮; 3. తొలఁగింపఁబడనిది: చూ, హీనము. 3-౫; 5. అనవరతము: చూ, సంతతము. ౯.
అచ్ఛీకృతము. సం. విణ. నిర్మలముగాఁ జేయఁబడినది: చూ, నిర్మలము. ౩.
అచ్ఛేద్యము. సం. విణ. 1. చొరరానిది: చూ, సాంద్రము. 2; 2. ఛేదింపశక్యముగానిది: చూ, విచ్ఛిన్నము. ౩-౮; 3. ఛేదింపఁగనిది: చూ, విచ్ఛిన్నము. ౩-౯.
అచ్ఛోదము. సం. వి. అ. పు. 1. కుబేరుని క్రీడాసరస్సు: చూ, సరస్సు. 1; విణ. 2. నిర్మలమైననీళ్లుగలది: చూ, సలిలము. 1-౪౪.
అచ్యుతము. సం. విణ. 1. జాఱనిది, పడనిది: చూ, స్ఖలనము. 2-౪; 2. నాశములేనిది: చూ, స్థిరము. ౪; 3. భ్రమముకానిది: చూ, విభ్రమము. 1-౧; 4. కారనిది: చూ, స్రవము. 1-౫.
అచ్యుతవాసము. సం. వి. అ. పు. రావి*: చూ, శ్యామలము. 2.
అచ్యుతాగ్రజుఁడు. సం. వి. అ. పు: చూ, బలరాముఁడు.

**అచ్యుతాయనమః.** అం. అన్నియు నశించి నను తాను నశింపని వస్తువుకొఱకు నమస్కారము: చూ, ఓమ్. 4-౨౦.

**అచ్యుతుఁడు.** సం. వి. అ. పు. 1: చూ, విష్ణువు. 1; 2. శనిగ్రహము: చూ, శని; 3: చూ, శివుఁడు. 1.

**అజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి: చూ, మాయ. 1; 2. ఆఁడుమేఁక: చూ, మేషము. 1-౧.

**అజంభము.** సం. వి. అ. పు. 1. కప్ప: చూ, హరి. 12; విణ. 2. పండ్లులేనిది, దంతములులేనిది: చూ, పల్లు. 1-౫.

**అజంభుఁడు.** సం. వి. అ. పు. 1. రవి: చూ, సూర్యుఁడు.

**అజక.** సం. వి. ఆ. స్త్రీ. అజకాజాతము అను ఒకానొక కంటిరోగము: చూ, లోచనము. 1-౧౩.

**అజకర్ణము.** సం. వి. అ. పు. 1. నల్లమద్ది*: చూ, సాలము. 3-౨; 2. వేఁగిస*: చూ, సర్జకము. 2; 3. మిరియము*; చూ, వెల్లజము.

**అజకవము.** సం. వి. అ. న. 1. రూ- అజకావము-అజగావము-అజగవము - అజగవము-ఆజీగవము - ఆజీగావము. శివుని విల్లు, పినాకము: చూ, బాణము. 1-౩౪; పు. 2: అజగంధ*: చూ, వాయింట.

**అజకాజాతము.** సం. వి. అ. పు: చూ, అజక.

**అజకావము.** సం. వి. అ. న. 1: చూ, రూ-అజకవము. 1; పు. 2. శివుని యెద్దు: చూ, వృషభము. 1.౩౧.

**అజగంధ.** సం. వి. ఆ. స్త్రీ: చూ, అజకవము. 2. *.

**అజగంధిక.**—పై.—

**అజగంధిని.** ఈ. స్త్రీ.—పై.—

**అజగరన్యాయము.** న్యా. కొండచిలువ నిద్రఁబోవుచుండి జంతువులను ఆతాత్తుగా ప్రింగినట్లు. (కొండచిలువ స్థూలశరీరముగలది గదలక మెదలక యొక్కచోటఁబడియుండును. చలనము లేమి దానిని గాఢనిద్రాయముగాఁ దలఁచి దగ్గఱను జంతువులు రాఁగా వానిఁ బట్టి భక్షించును.)

**అజగరము.** సం. వి. అ. పు. (మేఁకను మ్రింగునది) కొండచిలువ: చూ, సర్పము. 1-౨౦. [యోషధి.

**అజగరి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక

**అజగరోపవాసము.** జా. కొండచిలువయుపవాసము చేయుట: చూ, ఘోటకబ్రహ్మచర్యము.

**అజగర్దము.** సం. వి. అ.పు.1. నీరుపాము: చూ, సర్పము. 1-౨౭; 2.నల్లత్రాఁచు: చూ, సర్పము. 1-౨.

**అజగలుఁడు.** సం. వి. అ. పు. జూదరి: చూ, హారకుఁడు. 2.

**అజగల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. శిశురోగవిశేషము: చూ, రోగము 1-౪౦.

**అజగవము.** సం. వి. అ. న: చూ, రూ-అజకవము. 1.

**అజగుఁడు.** సం. వి. అ. పు. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

అజఘన్యుఁడు. అం: చూ, ఆదిత్యులు.

అజజీవికుఁడు. సం. వి. అ. పు. మేఁకల వలన బ్రదుకువాఁడు. రూ-అజజీవఁడు-అజాజీవుఁడు: చూ, మేఁకలఁగాఁపరి.

అజజీవుఁడు. —సై.—

అజట. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-అజ్ఝట. నేలయుసిరిక*: చూ, శివ. 4; 2. దూలగొండి*: చూ, శూకశింబ; 3. ఎలుకచెవి*: చూ, స్ఫోటశోఫ. 1-౧.

అజత. సం.వి.ఆ.స్త్రీ. 1: చూ, అజట.1.*; 2: చూ, అజట.2.*; 3: చూ, అజట. *3.

అజధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1 అడవిమొల్ల*: చూ, హరిణి. 5; 2. మేఁకలమంద: చూ, మేషము. 1-౨.

అజన్మము. సం.వి. న్. పు. 1. జన్మము లేమి: చూ, మోక్షము. 1; విశే. (న్.న్. అ.న్.) 2. జన్మములేనిది: చూ, సంభవము. 1-౩.

అజన్యము. సం. వి. అ. న. 1: చూ, రూ-అంజన్యము; విశే. 2. పుట్టనిది: చూ, సంభవము. 1-౩; 3. పుట్టింపఁదగనిది: చూ, సంభవము. 1-౪; 4. జనులకు హితముకానిది: చూ, హితము.4-౧; 5. నింద కానిది: చూ, ఉపదూషితము. 2.

అజప. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉచ్ఛ్వాస నిశ్వాసముల చేతనే అక్షరములను పుట్టించుట అనఁగాఁ బలికించునట్టి మంత్రము. (అజపాగాయత్రి. ఇదియే "హంసః" అనుమంత్రము. కాశీ. ౫-౨౪౪): చూ, మంత్రము, 1-౧౩; 2. సగము మగపోలికయు సగము ఆఁడుపోలికయుఁ గల రూపము.

అజపథము. సం. వి. అ. పు. 1. మేఁకల త్రోవ: చూ, మార్గము.1-౨౯; 2. ఆకాశమునందని ఛాయాపథవిశేషము (ఇది మొదలుకొని అగస్త్యాశ్రమము వఱకు పితృయానపథము): చూ, మార్గము.1-౩౦.

అజపాదము. అం. రూ - అజైకపాత్తు. పూర్వాభాద్ర: చూ, రిక్క. 1-౨౬.

అజపాదుఁడు. అం: చూ, రుద్రులు.

అజపుఁడు. సం. వి. అ.పు. 1. వైదికములు కాని గ్రంథములఁ జదువువాఁడు, కుపాఠకుఁడు, మంత్రములు క్రమముగాఁ జదువనివాఁడు: చూ, పాఠకుఁడు. 1-౧; 2: చూ, మేఁకలఁగాఁపరి.

అజభక్షము. సం. వి. అ. పు. 1. బొబ్బిలి*: చూ, విట్ఖదిరము; 2. వర్వరి*: చూ, అజగంధ.

అజమారము. సం. వి. అ. పు. అజ్మీరు అను దేశము: చూ, సీమ. 1-౪౦.

అజమారుఁడు. సం. వి. అ. పు. 1. కటికివాఁడు: చూ, సంహారకుఁడు.

అజమీఢము. సం: చూ, అజమారము.

అజమీఢుఁడు. సం. వి. అ. పు. ధర్మరాజు: చూ, యుధిష్ఠిరుఁడు.

అజమీళుఁడు. సం. వి. అ. పు. పాతాళలోకములోని సర్వవనము నందుండు శివుఁడు: చూ, శివుఁడు. 1-౨.

అజము. సం. వి. అ. పు. 1. మేఁకపోతు: చూ, మేషము. 1; 2. మూఁడేండ్లక్రిందటి వడ్లు: చూ, ధాన్యము. 1-౩౪; 3. అత్మ.

చూ, హంసుఁడు. 1; 4. ఆకాశము: చూ, సువర్ణము. 1;5. గొఱ్ఱెపోతు: చూ, మేషము. 1-౮; 6. మాక్షికధాతువు: చూ, సారఘము. 1-౧-(౧); 7. మేషరాశి: చూ, రాసులు. ౧; విణ. 8. ఉత్పత్తిలేనిది (లేక) జన్మములేనిది: చూ, సంభవము. 1-౩.

అజముఖుఁడు. సం. వి. అ. పు. గొఱ్ఱెతల తలగానమర్పఁబడినవాఁడు: చూ, దక్షప్రజాపతి.

అజమోద. సం. వి. అ. స్త్రీ. 1. రూ-అజామోదము, ఒకరకము ఓమము: చూ, యవాని. 1; 2. బూరుగుబంక: చూ, శాల్మలీవేష్టము.

అజమోదిక.—వై.—

అజయ. సం. వి.అ. స్త్రీ. 1. గంజాయి*: చూ,భంగి. 1; 2.దుర్గాదేవిచెలికత్తెలలో నొకతె: చూ, పార్వతి 1-3; 3.అజ, మాయము: చూ, మాయ. 1; 4. తీఁగెగన్నేరు*: చూ, తృణము. ౧-౨౨.

అజయము. సం.వి.అ.పు. రూ-అపజయము: చూ, ఓటమి. 7.

అజయుఁడు. సం. వి. అ. పు. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3. ఒకానొక సంస్కృత నిఘంటుకర్త;విణ.4. గెలుపులేనివాఁడు: చూ, విముక్తుఁడు.

అజయ్యము. సం. విణ. జయింపశక్యముఁ గానిది.

అజర. సం. వి. అ. స్త్రీ. 1. కలబంద *: చూ, గృహకన్య; 2. బొడ్డి*: చూ, శ్యామము. 7; 3. జల్లి: చూ, హాలాహలము.

అజరము. సం. వి. అ. న. 1. పరమాత్మ: చూ, హంసుఁడు; పు. 2. బొడ్డి*: చూ, అజర. 2; విణ. 3. ముదిమిలేనిది:చూ, యౌవనభేదములు; 4.క్షీణింపనిది: చూ, శాశ్వతము. 1.

అజరుఁడు. సం. వి. అ. పు. ముదిమిలేనివాఁడు, దేవత: చూ. వేల్పు. 1.

అజర్యము. సం. వి. అ. న. 1. చెలిమి: చూ, స్నేహము. 1; విణ.2.క్షీణింపనిది: చూ, శాశ్వతము. 1. (మైత్రీవాచకమునకు విశేషణమైనప్పుడే యీ రూపము సిద్ధించును. ఇతర స్థలములయందు బుకారాంతమునకు "అజరిత" అగును.)

అజలంబనము. సం. వి. అ. న. సౌవీరాంజనము (సుర్మా):చూ,సౌవీరము. 2.

అజలోమ. సం. వి. అ. స్త్రీ: చూ, అగ్రపర్ణి*.

అజలోమము. సం. వి. న్. పు. 1. దూలగొండి*: చూ, శూకశింబి; 2. మేకవెంట్రుక: చూ, వెంట్రుక. 1-౨౪.

అజవాహనము. సం. వి. అ. పు. తెలిపిట్ట: చూ, హంస. 1.

అజవీధి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1.మేకల త్రోవ: చూ,మార్గము. 1-౨౯; 2.ఆకాశమునందలి ఛాయాపథ విశేషము: చూ, మార్గము. 1-౩౦. (ఇదిమొదలుకొని అగస్త్యస్థానమువఱకు పితృయానపథము)

అజశృంగి. సం. వి, ఈ. స్త్రీ. జొట్టుపు*: చూ, విషాణి; 2: చూ, వద్ది*.

అజస్రము. సం. క్రి. విణ, అ. న. ఎల్లప్పుడు: చూ, సంతతము. 2.

అజహ. సం. వి. అ. స్త్రీ. దూలగొండి*: చూ, శూకశింబ.

అజహల్. అం: చూ, లక్షణలు.

అజహ్మము. సం. విణ. రూ-అజిహ్మము. బుజువు: చూ, హృద్యము. 2. ౪.

అజాంత్రి. సం. వి. ఈ. స్త్రీ: చూ, నీలబుహ్నా*.

అజాకృపాణీయన్యాయము. న్యా. మేక వచ్చినది. హఠాత్తుగా మెడపైఁ గత్తియునుబడినది. అతర్కితోపనతమగు కీడునుగూర్చి తెలుపుటకు దీని నుపయోగింతురు. (తత్సమచంద్రిక.)

అజాగవము. సం. వి. అ. న: చూ, రూ-అజగవము.

అజాగళస్తనన్యాయము. న్యా. మేక మెడ క్రిందస్తనములపుట్టుకనిష్ప్రయోజనము.

అజాగళస్తనము. సం. వి. అ. పు. బ. మేక మెడక్రిందిచన్నులు: చూ, స్తనము. 1-౧౦.

అజాగ్రత. సం. వి. అ. స్త్రీ. రూ-అజాగ్రత్త, జాగ్రత్తలేమి.

అజాగ్రత్త.—పై.—

అజాజి. సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.

అజాజీవి. సం. వి. ఇ. పు. రూ-అజాజీవుఁడు: చూ, మేకలఁగాఁపరి.

అజాజీవుఁడు. సం. వి. అ. పు. 1-పై.-; 2: చూ, గొంగళ్ళు నేయువాఁడు.

అజాతశత్రువు. సం. వి. ఉ. పు. 1: చూ, అజమీఢుఁడు; విణ. 2. శత్రువులు లేనివాఁడు.

అజాతస్మరాలింగనము. అ: చూ, ఆలింగనములు. 2.

అజాతస్మరాలింగనములు. అం: చూ, ఆలింగనములు. 2-౧.

అజామోద. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-అజమోద. *.

అజాపత్య. సం. వి. అ. స్త్రీ. బ్రహ్మపట్టణము: చూ, దేశము. 1-౧౪.

అజాపుత్రనామోత్కీర్తనన్యాయము. న్యా. పుట్టని బిడ్డలకుఁ బేరుపెట్టినరీతి.

అజామోదము. సం. వి. అ. పు; చూ, రూ-అజమోద. 1*.

అజాయువు. సం. వి. ఉ. పు. ఒకరకము మందు: చూ, మందు. 1.

అజావయుక్కు. సం. వి. క్. పు. బాణమునకుఁ జిక్కనిమృగము: చూ, విషమము. 2.

అజితము. సం. విణ. 1. అడ్డగింపశక్యమైనది; అం. 2: చూ, ఆగమములు.

అజితుఁడు. సం. వి. అ. పు. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. నలువ: చూ, బ్రహ్మ. 1; 3. ముక్కంటి: చూ, శివుఁడు. 1; విణ. 4: చూ, అపరాజితుఁడు.

అజినపత్ర. సం. వి. అ. స్త్రీ. జివుకపిట్ట: చూ, చీకురువాయి.

అజినము. సం. వి. అ. న. రూ-ఆజినము. చర్మము: చూ, బెరడు. 1.

అజినయోని. సం. వి. ఇ. పు, స్త్రీ. జింక: చూ, హరిణము. 1.

అజిరము. సం. వి. అ. న. 1. అంగణము:

చూ, మంగిలి. 2;౨. కప్ప:చూ,హరి.12; 3. గాలి: చూ, వాయువు. 1; 4. దేహము: చూ, శరీరము. 1; 5. శబ్దాదివిషయము; 6. తెప్ప: చూ, ప్లవము; 7: చూ, వట్టివేరు ❋:

అజిహ్మగము. సం. వి. అ. పు. అమ్ము: చూ, బాణము. 1.

అజిహ్మము. సం. వి. అ. పు. 1. కప్ప: చూ, అజిరము. 2; విశే. 2: చూ,రూ-అజిహ్మగము.

అజిహ్వము. సం. వి. అ. పు. 1. కప్ప: చూ,రూ-అజిహ్మము. 1;విశే.2. నాలుక లేనిది.

అజీగవము. సం. వి. అ. న: చూ, రూ-అజకవము.

అజీగావము.——పై.——

అజీర్ణము. సం. వి. అ. న. 1. అజీర్తి: చూ, రోగము. 1-౨; విశే. 2. జీర్ణము కానిది.

అజీర్తి. సం. వి. ఇ.న: చూ, అజీర్ణము. 1.

అజీవుఁడు. సం. వి. అ. పు. జీవుఁడు లేఁడను మతము నేర్పఱచినవాఁడు.

అజుఁడు. సం. వి. అ. పు. 1: చూ, అజితుఁడు. 1; 2: చూ, అజితుఁడు. 2; 3: చూ, అజితుఁడు. 3; 4. దశరథుని తండ్రి: చూ, రాజు. 1; 5: చూ, మన్మథుఁడు; 6. మూర్ఖుఁడు: చూ, నబుఁడు.

అజుష్టము. సం. విశే. సేవింపఁబడినది: చూ, ఆసేవితము.

అజైకపాత్తు. సం. వి. ద. పు. 1. పూర్వప్రోష్ఠపదానక్షత్రదేవత: చూ, వేలుపు. 1-౬; స్త్రీ. 2: చూ, అజపాదము; అం. 3: చూ, రుద్రులు.

అజౌఘము. సం. విశే. మేఁకలమంద: చూ, మేషము. 1-౨.

అజ్జుక. సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు వేశ్య: చూ, రూ- అజ్జుక.

అజ్ఝట. సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక❋: చూ, శివ. 4.

అజ్ఝటాఫల. సం. వి. ఆ. స్త్రీ. గురివెంద❋: చూ, శ్వేతపాకి.

అజ్ఝల. సం. వి. ఆ. స్త్రీ. బొగ్గు: చూ, వహ్ని. 1-౨౯.

అజ్ఞత. సం. వి. ఆ. స్త్రీ. తెలివిలేని తనము: చూ, స్వాపము. 3.

అజ్ఞత్వము. సం. వి. అ. న. ——పై.——

అజ్ఞాతవాసము. వా. సం. తనపేరు ఊరు ఇతరులకు తెలియనియ్యక మారుపేరుతో దాఁగియుండుట.

అజ్ఞానదాయకములు. అం: క్రోధము, హింస, అభోజ్యభోజనము, అసత్యవాదము, అసత్ప్రలాపము, పరనారీపరత్వము, శఠత్వము, అనాచారము, అకార్యకరణము. (౯)

అజ్ఞానము. సం. వి. అ. న. 1: చూ, అజ్ఞత; అం. 2: చూ, హేయగుణములు.

అజ్ఞాని. } సం. విశే: చూ, అజుఁడు. 6.
అజ్ఞుఁడు. }

అజబాజురేటు. వా. వి. సరిహద్దు ధర.

అజాఅంబారా. వా. విశే. రూ- అగో

అంబారా: అంతులేనిది, దిక్కు-మొక్కు-లేనిది.

అజావజా..—పై.—

అజారము. దే. వి. రూ-హజారము-హజారము-హాజారము-హాజాఱము. 1. నగరి తలవాకిలి చావడి: చూ, రూ-హజారము; 2. ఆస్థానమండపము. రా, వి. 2, అ. ౩౯: చూ, సభ. 2.

అజ్జ. దే. వి. 1. కాలుచాఁచిపెట్టిన యడుగు: చూ, రూ—హజ్జ. 1; 2. అదను. "అజ్జపాటించి మదివెఱపుజ్జగించి" భార. శల్య. ౧, ఆ: చూ, సమయము. 1; పై. అవ్య. 3. బళి. రూ-అజ్జా-అజ్ఝారె-అజ్జారే-అజ్ఝా-అజ్ఝారె - అజ్ఝారే. "వ. అజ్జగాఁ దిలకంబు హవణించినుకుట." (అజ్జగా- అజ్జయనుశబ్దము పుట్టఁగాబళీయనఁగాననుట. భ. రా. పు.చరిత్రము: చూ, సేబాసు; వి. 4. నైపుణ్యము:చూ, సమర్థనము. 1:

అజ్జము. వై. వి.=అధ్యాయము. 1.అనువాకము, కొన్ని పనసలుగల వేదభాగము. పాంచా. ౪-౧౨౫: చూ, వేదము. 1-౧౫-(3); 2. గ్రంథభాగవిశేషము: చూ, సంపుటము. 3. ౧౦.

అజ్జరె. ద్వ. అవ్య. (అజ్జ+రె) రూ-అజ్జరే: చూ, అజ్జ. 3.

అజ్జరే. —పై.—

అజ్జవాలు. ద్వ.వి. కోడి, చరణాయుధము: చూ, పుంజు.

అజ్జాఅంబారా. వా. వి: చూ, రూ- అజాఅంబారా.

అజ్జారె. ద్వ. అవ్య. (అజ్జా+రె) రూ-అజ్జారే: చూ, అజ్జ. 3.

అజ్జరే. —పై.—

అజ్ఝా. మి. అవ్య. —పై.—

అజ్ఝారె. —పై.—

అజ్ఝారే. —పై.—

అట. దే. వి. ఏ. 1. అక్కడ "క. అంతే నట నక్కుమారుండెంతయు." నిర్వ. ౨. అ. (అట ఇట శబ్దములకు వృత్తియందు అంత ఇంత అను నర్థము కలుగుచున్నది. అటమున్న అంతకుముందు. ఇటమున్న ఇంతకుముందు): చూ, తత్ర; క్రి. 2. అవుల. "అవల హేమకూటంబును నటనిషధంబు నొప్పు" భార. భీష్మ. ౧. ఆ: చూ, రోధస్సు; అం. 3. రూ-ఆట: చూ, ఆటతాళము.

అటక. దే. వి.రూ-ఆటుక-అట్టుక-అట్టువనట్టుక, మసెల (చిట్టి అటక అనియు పెద్దమిద్దెక్రింది చిన్నమిద్దె అనియు ఘాడుక): చూ, సదనము. 1-౫.

అటకమామిడి. దే. వి.రూ-అటికమామిడి. మండలచ్ఛదము*: చూ, మామిడి. 1-౩.

అటకలి. దే.వి. నూనెజిడ్డును పోఁగొట్టెడి వస్తువు, ఉత్సాదనము; చూ, నలుఁగుఁబిండి.

అటకాఁపు. వా. వి. అడ్డము: చూ, సంరోధము.

అటకాయించు. వా. స. క్రి. అడ్డగించు.

అటకావు. వా. వి: చూ, రూ-అటకాఁపు.

అటట్య. సం. వి. అ. స్త్రీ రూ-ఆటాట్య. భిక్షలోనగువాని కొఱకు తిరుగుట; చూ, సంచారము. 1-౪.

**అటతాళము.** సం. వి. అ. పు. తాళభేదము.(౧౪ అక్షర కాలము): అట-అట. (వా.అటతాళము): చూ, తాళము. 1-౮; (చూ, సూచకములు: చూ, స్వరము. 2-౧౪౧-(౨).)

**అటని.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. కోటి:చూ, వింటి కొప్పు.

**అటమట.** దే. వి. 1. నుఱుఁగుమాట:చూ, శబ్దము. 2-౫; 2. దుఃఖము: చూ, శోకము. 1-౧; 3. మోసము: చూ, వంచన; విణ. 4. రూ-అటమటము. నిరుపయోగము: చూ, వ్యర్థము. 1; 5. కల్ల: చూ, వితథము.

**అటమటకాఁడు.** దే.విణ.రూ-అటమటీఁడు: చూ, వంచకుఁడు. 1.

**అటమటము.** దే. విణ. 1: చూ, రూ-అటమట. 4; 2: చూ, రూ- అటమట. 5.

**అటమటించు.** దే. అ. క్రి. 1. కదలు. స్వా. ౫-౧౦౧: చూ, సలించు; స. క్రి. 2: చూ, వంచించు; 3. దొంగిలించు. వి. పు. 6-౩౦౫: చూ, సవపు.

**అటమటింపు.** దే. వి. 1. చలనము: చూ, లోలము. 1; 2. మోసము: చూ, అటమట. 3; 3. వ్యథ; చూ, అటమట.2; 4. దొంగతనము: చూ, హరణము. 1.

**అటమటీఁడు.** దే.విణ.(అటమట+ఈఁడు) మోసకాఁడు. ఉ. హరి. 3. అ: చూ, రూ-అటమటకాఁడు.

**అటమర.** దే. వి. 1: చూ, రూ- అటమటము. 2; 2. యుద్ధమువలనఁబాఱుట: చూ, సంగ్రామము.

**అటమరింపు.** దే. వి: చూ, అటమర. 2.

**అటమున్న.** దే. అవ్య. అంతకుముందు.

**అటరుషము.** సం. వి.అ. పు.=అడ్డసరము. రూ-అటరూషము*: చూ, వైద్యమాత.

**అటరూషము.** —వై.—

**అటవి.** సం. వి. ఈ. స్త్రీ.=అడవి: చూ, విపినము.

**అటాట్య.** సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-అటట్య.

**అటి.** దే. విణ. అటువంటి. స్వా. 3-౮౪: చూ, రూ- అట్టి.

**అటిక.** దే. వి. రూ-అట్టిక. ఎసల, చట్టి: చూ, పాత్రము. 6-౨.

**అటికమామిడి.** వా. వి: చూ, రూ-అటక మామిడి*.

**అటికము.** సం. వి. అ. పు. బకపుష్పము*: చూ, శ్రీవల్లి.

**అటు.** దే. అవ్య. రూ-అటులన్-అటులు-అట్టు-అట్టులన్-అట్టులు. అలాగు. కళా. ౧-౪౩: చూ, తథా. 2.

**అటుక.** దే. వి: చూ, రూ-అటక.

**అటుకులు.** దే. వి. బ.. రూ-అడుకులు:చూ, సాదము. (1)—౪౮.

**అటుగాన.** దే. ద్ర. హేత్వర్థకము: చూ, హేతువు. 1-(౧).

**అటుమొన్న.** వా.వి. అవలిమొన్న.మొన్నటికి పూర్వదినము: చూ, రోజు.1-౬.

**అటులన్.** దే. ద్ర. రూ-అట్టులన్: చూ, రూ-అటు.

అటులు. దే. అవ్య: చూ, రూ-అటు.

అటువంటి. దే. వి॰. అవ్య.—పై.—విపు. ౩-౩౬౦:

అటువలె. దే. అవ్య.—పై.—

అటువోలె. . వా. అవ్య.—పై—

అటె. దే. అవ్య.రూ - అటే-ఒట్టె - అట్టే. 1. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; 2. దుఃఖార్థకము: చూ,శోకము.1-౧౪; 3. సంశయార్థకము:చూ,సంశయము. 1.

అటే— పై.—

ాటో—పై.—

అటో—పై.—

అట్ట. దే. వి. 1. చర్మము: చూ, బెరడు. 1-౩; వా. 2. తలతెగిన శరీరము: చూ, మొండెము; 3. మృగచర్మము: చూ, బెరడు. 1-౧౨; 4. చెప్పులకొఱకుఁ జక్కఁబఱుపఁబడిన చర్మఖండము. పట్టెడ: చూ, బెరడు. 1-౮; 5. అత్త డము; చూ, కాకితపుఅట్ట.

అట్టచెమ్మ. ద్వ. వి. నాలుగుగవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొక బాలికల ఆట: చూ, బాలక్రీడ.

అట్టడి. వై. వి. =అట్టు. రూ-అట్టెడి. అట్టము.యుద్ధార్థము వాకిటి మంటపము మీఁదఁగాని కొత్తళముమీఁదఁగానియే ర్పఱచినగది: చూ, సదనము. 1-౭.

అట్టము. సం. వి. అ. పు. 1. = అట్టడి. —పై.—; 2. మేడ: చూ, సదనము. 1-౧. (అట్టహాసమని కొందఱు); 3. అతిశయము: చూ, పేరాశము. 4: చూ, వంటచెఱుకు; 5. ప్రవాహము: చూ, వెల్లువ; 6. అన్నము: చూ, సా దము. (1); 7. తోడవు: చూ, భూష ణము. 2; వై.వి. (1)=అష్టకమ్. రూ. మి. అట్ఠము. వేదభాగము; (2)=అట్ట ము. అట్టడి:చూ,అట్టము.1. (వైకృతము అని కొందఱు.)

అట్టయోధి. సం. వి. ఇ. పు. ఒకరకము పక్షి: చూ, పక్షి.

అట్టశాల. సం. వి. ఆ. స్త్రీ. = అడసాల. పాకస్థానము:చూ, సదనము. 1-(౪౭).

అట్టహాసకము. సం. వి. అ. పు. కుంద*: చూ, కూటపుష్పము.

అట్టహాసము. సం. వి. అ. పు. 1. వీరరౌ ద్రరసములవలనఁబుట్టెడి పెద్దనవ్వు: చూ, హాస్యము. 1-౭; 2: చూ, అట్ట ము. 3.

అట్టాలకము. సం. వి. అ.పు. 1. =అట్టడి: చూ, అట్టడి; 2. మేడ: చూ, అట్టము. 2.

అట్టి. దే. విః: చూ, రూ- అటి.

అట్టిఁడు. దే. విశ. (అట్టి+వాఁడు) రూ- అట్టివాఁడు—అట్టిఁడు, అటువంటివాఁడు.

అట్టిక. దే. వి: చూ. రూ-అటుక.

అట్టియ. దే. వి.గుంపు:చూ,సమూహము.1.

అట్టు. దే. వి. 1. అప్పచ్చి: చూ, భక్ష్యము. 1-౪; అవ్య. 2: చూ, రూ- అటు; వా. 3. తట్టు,దెబ్బ:చూ,హతి.1.

అట్టుక. దే. వి: చూ, రూ-అటుక.

అట్టుపుట్టానవాలు. వా. వి. తొల్లింటికత: చూ, సమాచారము. 2.

అట్టుప్పు. దే. వి. (అట్టు+ఉప్పు) పాక్య మను లవణము: చూ, రూ-అంట్లుప్పు.

అట్టుల. దే. ద్ర: చూ, రూ-అటుల.

అట్టులు. దే. వి: చూ, రూ-అటులు.

అట్టువ. దే. వి: చూ, రూ-అటక.

అట్టువోలె. దే. ద్ర. (అట్టు+పోలె): చూ, రూ-అటువోలె. భార. శాం. ౨, ౮.

అట్టె. దే. అవ్య: చూ, రూ-అటె.

అట్టెడ. దే. వి.1. కసవులోనగునవికోయువారు దానినుంచుకొనుటకై పిఱుఁదుల మీఁద జాఱఁగట్టుకొనెడి సంచి: చూ, సంచి. 1-౩; 2. అధకమితగోణి, తూమెడుగింజలు పట్టెడి గోనె: చూ, సంచి. 1-౬; 3. వంతెన: చూ, సేతువు. 1-౫; 4. ఈఁతబ్రద్దలులోనగు వానితో అల్లినతట్ట: చూ, సజ్జ. 1; 5. కాయధాన్యముల యంపలి మంటి గడ్డలు మొదలగువాని వెలువరించుటకుఁ గట్టినగోఁగు కట్టెలులోనగువాని మోఁపు; 6. వెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడవంటి తడిక.

అట్టె. దే. అవ్య: చూ, రూ- అటె.

అట్లతద్దె. వా. వి. ఆశ్వయుజబహుళ తదియ నాఁడు బాలికలు భర్త చిరాయువగుట కు భక్తిగలిగి అట్లతో నోచుకొను మహాలక్ష్మీవ్రతము, అట్లనోము, తద్దె: చూ, సంబరము 1-౯:(చూ, ఉండ్రాళ్లతద్దె)

అట్లనోము. వా. వి. —పై—.

అట్లాం (ట్లాం) టి(తి)కు మహాసముద్రము. అం: చూ, సముద్రము. 1-౪.

అట్లాగు. వా. అవ్య: చూ, అటు.

అట్లు. దే. అవ్య. —పై.—

అట్లుడుకుట. జా. 1. కల్లోలమును బొందుట; వా. 2. పెనముపై అట్లువేసుట.

అట్లుడికినట్లుడుకుట. జా. అట్లవలె విశేషముగ గుండెతల్లడిల్లుట.

అట్లొట్లు. దే. వి. బ, రూ- నట్లొట్లు. వాన వెలిసినపిమ్మట చూరునుండిపడు నీరు బొట్లు: చూ, వంగుళ్లు: (చూ, బొట్టు) 1-6-(౧.)

అతాత్తు. వా. అవ్య: చూ, అకస్మాత్తు.

అడ. దే. వి. 1. పింఛము. యయా. ౨. ౮:చూ, పాదము (1)-౨౩; 2. ఆకృతి. స్వా. 3-౪౬: చూ, స్వరూపము. 1-౧; వా. 3. అంటలుగట్టిన తల వెండ్రుకల చిక్కు, అడపము; వా. 4. జాడ: చూ, సూచన. 1.

అడంగు. వా. వి. 1. బయలుదేరిన మొదటి చోటు: చూ, స్థానము. 1-౪౪; బ. 2. గ్రామకరణముల మొదటి లెక్కల పొత్తము: చూ; సంపుటము. 3-౨౪.

అడఁకువ. దే. వి. రూ- అణఁకువ- అణుకువ. నమ్రత: చూ, వినయము. 1.

అడఁగారు. దే. అ. క్రి. రూ- అణఁగారు- అడఁగు: చూ, గ్రుక్కు. (౪).

అడఁగు. దే. అ. క్రి. 1. రూ-అణఁగు-అడఁగారు-అణఁగారు-ఆఁగు-ఆఱు.—పై.—; 2. తగ్గు: చూ, గ్రుక్కు.(9); 3. మెత్తఁబడు: చూ, 1-౧; 4. అస్తమించు: చూ, సమయు; 5. లోపడు: చూ, లోపించు. 1. [ఉపశాంతి. 1.

అడఁగుట. దే. వి. రూ-అణఁగుట: చూ,

అడఁగుబొద్దు. దే. వి. ఖేలుధారిలోపలన

ణఁగియుండునట్లు గోడయందులయందు గీఱ్ఱియేస్పుఅవెడి బొద్దు: చూ, మొలత్రాడు. 2.

అడఁచు. దే. ప్రే. రూ-అణఁచు. అడఁగఁజేయు (అనుప్రయుక్తమైన అడఁగు ధాతువునకును రూపము): చూ, పిసుకు. ౩.

అడకట్టు. దే. అ. క్రి. రూ-అడ్డకట్టు: చూ, ముద్దకట్టు.

అడకత్తు. దే. వి. రూ-అడకత్తెర- అడకొత్తు-ఆకొత్తు, పోఁకొత్తు (పోఁకలు ఒత్తునది): చూ, శంపుల. 1.

అడకత్తెర. ద్వ. వి.—పై.—

అడకము. దే. విణ. లోపలనడఁగినది, తీలు: చూ, స్తబ్ధము.

అడకర. దే. విణ. ఓరిమి: చూ, శాంతము. 1,

అడకాయ. దే. వి. పోఁకకాయ: చూ, పోఁక. 1—౩.

అడకించు. దే. స. క్రి. 1. వెక్కిరించు: చూ, హసించు; 2: చూ, వంచించు. భో. ౬-౬.

అడకొత్తు. దే. వి. (అడకాయ + ఒత్తు): చూ, రూ-అడకత్తు.

అడగొను. దే. అ. క్రి: చూ, ముద్దకట్టు.

అడగోలుకొను. దే. స. క్రి. రూ-ఒడగోలుకొను. అపహరించు. భో. ౬-౧౪: చూ, సడపు.

అడచిపాటు. దే. వి. వేగము: చూ, స్యదము.

అడజడి. దే. వి. 1. రూ-అలజడి. దుఃఖము: చూ, శోకము. 2; వా2. ఆడావిడి: చూ, సంభ్రమము, 1,

అడజడిపెట్టు. దే. స. క్రి: చూ, దుఃఖపెట్టు. మార్క. ౧-౧౯౯.

అడదడి. దే. వి. 1. దొరతనము: చూ, స్వారాజ్యము. 1-౧. (శ.గ); వా. 2: చూ, రూ-ఆడజడి. 2.

అడఁది. వై. వి.=హరిద్రా. రూ- అలఁది- అళఁది-అలిది. హళఁది. పచ్చఁదనము: చూ, వర్ణము. 6-౩.

అడప. దే. వి. 1. రూ- అడుప: చూ, పశురోగములు; 2. వక్కలాకులతిత్తిగల ఆఁకుది: చూ, స్త్రీ. 1-౩౮.

అడపకత్తియ. ద్వ. వి. రూ- అడపకత్తె: చూ, అడప. 2.

అడపకత్తె. —పై.—

అడపకాఁడు. దే. వి. అడపముంచుకొని యుండువాఁడు.

అడపట్టె. వా. వి. రూ- అడ్డపట్టె. పాలములోవిత్తనములువిత్తి మిట్టపల్లములు సమముగుటకై యొడ్లనుకట్టి త్రోలెడి మ్రాను: చూ, దిండు. ౯.

అడపతడప. వా. వి. రూ- అడపదడప: ఎడపదడప: చూ, అప్పుడప్పుడు.

అడపదడప. —పై.—

అడపము. దే. వి. 1. వక్కలాకులతిత్తి: చూ, రూ- హడపము. 1; 2. మంగలితిత్తి: చూ, రూ- హడపము. 2; వా. 3: చూ, అడ. 3.

అడపొడ. దే. వి. 1. అడుగులగురుతు. కళా. 7-౪౪: చూ, లక్షణము. 1; వా. 2. జాడ: చూ, సూచన. 1.

అడబాల. వై. విణ. 1. భోనకాఁడు: చూ,

సూపకారుఁడు; 2. పాచకి: చూ, వంటలక్క. 1.

**అడమర.** దే. వి. ముద్ద: చూ, సాదము. (1)—౨౩.

**అడరించు.** దే. క్రి. బాణమును ప్రయోగించు. మార్క. 6-౨౧౦: చూ, వైచు. 3.

**అడరు.** దే. వి. 1. ఏపు, ఆధిక్యము. అచ్చ. రా. అర, కాం: చూ, హేరాళము. 1-౧; 2. ఆపద: చూ, విపత్తు; అ. క్రి. 3: చూ, సమ్మతించు. 4: చూ, వ్యాపించు. భార. కర్ణ. ౨.౩; 5: చూ, వర్ధిల్లు, రామా. ౧. అ. 6: చూ, విజృంభించు. వీర. ౪, అ; 7. అతిశయించు. భార. విరా. ౪. అ: చూ, సందడించు; 8. పూను. భో. ౪-౧-౨౬: చూ, సమకట్టు. 2: 9. జన్మించు. భార. ఆర. ౬. అ: చూ, సంభవించు; 10. తొట్రుపడు: చూ, సంభ్రమించు; వా. 11. భయపడు; చూ, స్రుక్క. 1-(6).

**అదరుచు.** దే. క్రి. రూ- అడచ్చు: చూ, రూ- అడరించు.

**అడరుదెంచు.** దే. అ. క్రి. 1. అతిశయించు. మార్క. ౫, అ. 230: చూ, సందడించు; 2: చూ, సమ్మతించు; 3. అంతటను ప్రసరించు: చూ, వ్యాపించు; 4. పెరుఁగు: చూ, వర్ధిల్లు; 5. చెలరేఁగు: చూ, విజృంభించు; 6. పూను: చూ, సమకట్టు. 2; 7. జన్మించు: చూ, సంభవించు; 8. తొట్రుపడు: చూ, సంభ్రమించు.

**అడర్చు:** చూ, రూ- అడరుచు. కై. ౭-౧౦,

**అడలఁగొట్టు.** దే. స. క్రి. 1. గద్దించు: చూ, వెఱపించు; వా. 2. గుండెదడ పుట్టించు: అడలించు.

**అడలించు.** —పై.—

**అడలు.** దే. వి. 1. చింత: చూ, విప్రతీసారము; 2. భయము: చూ, సాధ్వసము; 3. ఏడుపు. భార. సౌ. ౨. అ: చూ, శోకము. 1; అ. క్రి. 4. ఏడ్చు: చూ, శోకించు. 2; 5. దుఃఖముతో వనరు, వాపోవు. కై. ౬. అ. ౨౬౫: చూ, విలపించు; 6. పుత్రమరణాది దుఃఖముచేతతపించు, వగచు: చూ, శోకించు. 1; 7. బెదరు, భయపడు. సాంబా. 3-౨౨: చూ, సుక్రు్క..(6)

**అడలుకొను.** దే. అ. క్రి: చూ, అడలు. 6. (దీనికి అడలుకడనున్న మిగత 4-5-7 అర్థములను సందర్భము ననుసరించి చెప్పుకొనవచ్చును.)

**అడవి.** వై. వి.=అటవి: చూ, విపినము.

**అడవికంద.** ద్వ. వి. సర్పనాశము*: చూ, సూరణము. 1-౧.

**అడవికాఁకర.** వై. వి. వనకారవేల్లము*: చూ, సుషవి. 1.

**అడవికాఁపు.** ద్వ. వి. ముని: చూ, సన్యాసి. 1.

**అడివికిక్కిస.** ద్వ. వి. అడవికిక్కిసగడ్డి*: చూ, తృణము. 1-౩.

**అడవికుక్క.** ద్వ. వి. తోఁడేలు: చూ, వృకము. 1,

చాలిన ఇచ్చినవారికి 8 నెలల వరకు సంపాదించుచుందును. క్రొత్త రేటు గడువులు:- ఆగష్టు నెల లోపున పూరా వెలకు 5-0-0 లు; సెప్టెంబరు నెలలోపున పూరా వెలకు 6-0-0 లు; అక్టోబరు నెలలోపున పూరా వెల 8—0—0 లు; పిదప పూరా వెల 10—0—0 లు త్వరపడుడు.

ఇట్లు, సారస్వత సేవకుడు.

ది 10-8-1948. సం॥రం. కొత్త శ్యామలాకామశాస్త్రి.
ఆంధ్ర వాచస్పత్య, హిందూస్తానీ వాచస్పత్య, ఆంధ్ర వ్యాకరణ వాచస్పత్యములకర్త. కరప, కాకినాడ. ప్రస్తుతము రాజమండ్రి.

## పండితాభిప్రాయములు.

విద్వాన్ ఉభయ భాషాప్రవీణ శ్రీకోగంటి దుర్గామల్లికార్జునరావు గారు బోర్డుహైస్కూలు. పామఱ్ఱు. కృష్ణాజిల్లా.

వాచస్పత్యముసత్కవి
వాచస్పతితతికిఁ గల్పపాదమురా!
వాచస్పత్యం బలరెకు
నాచంద్రార్కము రమేశునత్యంత కృపన్॥ ౧
వాచస్పత్యమునకు సరి
వాచస్పత్యంబెయగును వసుమతిలోనన్
వాచస్పత్య మహాత్త్వము
వాచంయమి పరీక్షకైన వర్ణింపదరమే॥
సద్వ్యోజాతంబులైన
విద్యాసంశయము లెల్ల వీడఁగఁజేయున్
విద్యాభివృద్ధిగూర్చును
విద్యార్థులు దీనిని దమవెంటనెయిడినన్॥
పండితజన మాన్యుండవు
పండితవంశజుఁడవీవు పరికింపగన్
బండిత సంతానంబునఁ
జండమయూఖుండవు కామశాస్త్రీ! బళిరా!॥ ౪
శాస్త్రజ్ఞ వరేణ్యులు మీ
శాస్త్రజ్ఞానంబుఁ గాంచి సంతసపడి యీ
శాస్త్రజ్ఞానం బెటులీ
శాస్త్రి [illegible] శాస్త్రీ! బళిరా!॥

రు అక్షరాలా.

TO

మహారాజశ్రీ శ్రీ Sri Jagadguru Visvaradya Simhasanam Kasi Benares. Jangamavadimatham Kasi-Benares City

From:- ఆంధ్రవాచస్పత్య కార్యాలయము,
ఆంధ్రవిద్యావాచస్పతి, కొట్ర శ్యామలకామశాస్త్రి,
కరప, కాకినాడ. ప్రస్తుతము రాజమహేంద్రవరము.






